

# చందమామ అపురూప లావణ్యం

ఓ హీరోయిన్ 30వ పడిలోకి వచ్చిందంటే.. ఆమె గ్లామర్‌లో తేడా కనిపిస్తుంది.. అవకాశాలు తగ్గుముఖం పట్టేస్తాయి కానీ కొందరు మాత్రం ఆ వయసులోనూ గ్లామర్ కాపాడుకుంటారు. మంచి మంచి అవకాశాలూ అందుకుంటారు.. అందుకు కాజల్ అగర్వాల్ ఓ ఉదాహరణ.. దశాబ్దం పైగా ఇండస్ట్రీలో కొనసాగుతూ ఇంకా తన ప్రత్యేకతను చాటుకుంటోంది చందమామ.. తన కొత్త సినిమా 'నేనే రాజు నేనే మంత్రి' సినిమాలో కాజల్ ఎంత అందంగా కన్పిస్తోందో పోస్టర్లను చూస్తే అర్ధమవుతుంది.. ఇపుడు లేటెస్టుగా రిలీజ్ చేసిన పోస్టర్లో చందమామ మరింతగా మెప్పిస్తోంది.. చూపు తిప్పుకోనివ్వని అందంతో కుర్రాళ్ల మతి పోగొట్టేస్తోంది.. మోడ్రన్ డ్రెస్సులో ఎంత కిక్కెస్తుందో సంప్రదాయ దుస్తుల్లో అంతగా ఆహ్లాదం పంచుతూ తనకు తానే సాటి అని రుజువు చేస్తోంది..

# మేఘా ఆకాష్ స్థానంలో

హీరో రామ్, కిశోర్ తిరుమల చిత్రం షూటింగ్ దశలో ఉన్న సంగతి తెలిసిందే.. ఈ సినిమాకు ..ఉన్నది ఒక్కటే జిందగీ అనే టైటిల్‌ను కూడ ఫిక్స్ చేశారు. అయితే ముందుగా ఈ సినిమాలో రామ్‌కు జోడీగా అనుపమ పరమేశ్వరన్, మేఘా ఆకాష్‌లను అనుకున్నారు. కానీ ప్రస్తుతం మేఘా ఆకాష్ స్థానంలో లావణ్య త్రిపాఠిని తీసుకోనున్నట్టు తెలుస్తోంది.. మేఘా ఆకాష్ లై సినిమా యుఎస్ షెడ్యూల్‌లో బిజీగా ఉండటం వల్ల డేట్స్ కుదరలేదట.. అందుకనే ఆమె స్థానంలో లావణ్య త్రిపాఠిని తీసుకున్నారు.



తారాతీరం

# అందంతో కాటేస్తుందా?



ఏక్తా కపూర్ నిర్మించిన హిందీ టివి సీరియల్ నాగిని దేశంలోనే ఎక్కువమంది చూసే సీరియల్‌గా పేరు తెచ్చుకుంది.. తెలుగులో కూడ వస్తున్న ఈ సీరియల్‌లో హీరోయిన్ మౌనిరాయ్ ఇపుడు బాలీవుడ్ మీడియాలో హాట్ టాపిక్ అయ్యింది.. టివి సీరియల్ హీరోయిన్‌కి కూడ ఒక బాలీవుడ్ హీరోయిన్‌కి ఉన్నంత ఇమేజ్ ఉండటం కొంచెం విశేషమే. ఇపుడు అవార్డు షో.. ఈమెకు టివి రంగంలో ఆమె చేసిన పాత్ర నాగినికి బెస్ట్ ఫిమేల్ విభాగంలో ఉత్తమ నటిగా అవార్డు కూడ వచ్చింది.. ఈ సీరియల్ ఫేమస్ కావటంతో మౌనిరాయ్ కూడ ఫ్యాషన్ షోల్లో ఫొటో షూట్లలో ఎక్కువగా కన్పిస్తూ ఉంది.. ఈ అవార్డు షోకి కూడా ఆమె వచ్చిన తీరు చూస్తే ఈమెకు ఏంతక్కువ బాలీవుడ్ హీరోయిన్ కావటానికి అని అనేస్తారు.. రెడ్ కార్పెట్‌పై నడిచిన ఈమెను ఆమె అందాలను చూసినవాళ్లు కళ్లన్నీ ఆమెపైనే పెట్టేశారట.. మరి ఈ నాగిని బాలీవుడ్‌ను తన అందంతో కాటేస్తుందా! అని అంటున్నారు.

కె.లీలా సువర్ణ

ఆదివారం వార్త

6 ఆగస్టు 2017

# విషయ విశేషం



## మంచి ముత్యాలు

అందం తొందరగా కంటికిపాతబడి పోతుంది. సౌశీల్యానికి మాత్రమే ఎప్పటికీ నశించని ఆకర్షణ ఉంటుంది.

-గురజాడ





# భావ వీచిక



## ఓ కాంతిరేఖ..

కలలు నెరవేరాలని అందరూ కోరుకుంటారు. కానీ అందుకు తగ్గ కృషి మాత్రం కొందరే చేస్తారు. వారే ఆ కలలను నిజం చేసుకోగలుగుతారు. అలాటివారికి ఓ చక్కని మెచ్చుతునక హర్షిత్ శర్మ. వయసు పదహారు. చండీఘర్‌లోని గవర్నమెంట్ మోడల్ సీనియర్ సెకండరీ స్కూల్ విద్యార్థి. విశేషం ఏమిటంటే తాజాగా ప్రఖ్యాత గూగుల్ కంపెనీ, ఏడాదికి 1.44 కోట్ల వేతనంతో హర్షిత్‌ను తమ గ్రాఫిక్ డిజైనింగ్ టీమ్‌లో చేర్చుకుంది. ఏడాదిపాటు ఇచ్చే ట్రెయినింగ్ కాలంలో నెలకు 4లక్షల రూపాయల స్టైపండ్ ఇస్తారట. ఆ తర్వాత నెలకు 4 లక్షలు జీతం అందుతుంది. గత పదేళ్లుగా అంటే ఆరేళ్ల వయసునుంచే తనకు గ్రాఫిక్స్ అంటే ఎంతో ఆసక్తి అని, తానెన్నో పోస్టర్లు తయారుచేశానని, ఆన్‌లైన్‌లో జాబ్స్‌కోసం అన్వేషించి, గూగుల్‌లో ఉద్యోగానికి అప్లై చేశానని, తనను ఆన్‌లైన్‌లోనే ఇంటర్వ్యూ చేశారని, తన పోస్టర్ల ఆధారంగానే తనకు అవకాశం ఇచ్చారని చెప్పాడు హర్షిత్. 11వ తరగతిలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ చదివాడు. తల్లిదండ్రులు టీచర్లు. ప్రైమ్ మినిస్టర్స్ డిజిటల్ ఇండియా స్కీమ్ కింద హర్షిత్ 7,000 రూపాయల అవార్డు కూడా అందుకున్నాడు. తన అంకుల్ సహాయంతో గ్రాఫిక్స్‌లో నైపుణ్యాన్ని సాధించగలిగానని చెపుతాడు హర్షిత్. పదహారేళ్ల వయసుకు హర్షిత్ సాధించిన ఉద్యోగ విజయం ఎంతో ఘనమైంది. మంచి బడిలో చదవటంలేదని కొందరు వాపోతుంటారు. కానీ హర్షిత్ చదువుకున్నది గవర్నమెంట్ స్కూల్లోనే. శ్రీమంతుల బిడ్డలం కామని కొందరు అసంతృప్తితో ఉంటారు. హర్షిత్ మధ్య తరగతి కుటుంబంవాడే. దురలవాట్లు సినిమాలు, షికార్లు, వీడియోగేమ్‌లు వగైరాలతో విలువైన కాలాన్ని వ్యర్థం చేసుకుంటూ టీనేజ్ పిల్లలు ఎంతోమంది కనిపిస్తున్న నేటి తరుణంలో హర్షిత్ వంటివారు కారుచీకట్లలో కాంతికిరణాలని చెప్పవచ్చు. హర్షిత్ మరెందరికో స్ఫూర్తి కావాలి. కలను పండించుకోవటానికి కావలసింది అకుంఠిత దీక్ష, తపన అని అర్థం చేసుకుంటే భారత్‌లో మరెందరో హర్షిత్‌లు విజయకేతనాలు ఎగురవేసి, భారత్‌కే కీర్తిపతాకలు కాగలరు!

# లేఖలు

## ప్రస్తుతానికి దర్పణం..

జూలై 23 వార్త ఆదివారం అనుబంధంలో 'డ్రగ్స్ పడగ!'.. ప్రమాదంలో దేశ భవిత.. కవర్ కథనం ప్రస్తుతం అందరినీ కలవర పరుస్తున్న విచ్చలవిడి మాదకద్రవ్యాలసరఫరా గురించి ఎన్నో విశేషాలు తెలియజేసింది. ఈ మత్తు నుండి యువతను, బాలలను కాపాడవలసిన బాధ్యత ప్రపంచ దేశాలపై ఉంది. 'భావవీచిక'లో పేర్కొన్న ఆదర్శ భారతీయుడు అందరికీ స్ఫూర్తిని వ్వాలి. 'ఆత్మీయులలో ఆద్యులు అమ్మానాన్నలు'..కర్తవ్యాన్ని తెలిపింది. కార్టూన్లు బాగున్నాయి. -ఎసత్యం ఆదూరి, నిజాంపేట; పక్కిరాధాగోపాలకృష్ణ, విశాఖపట్నం.

## కథలు బాగున్నాయి

జూలై 23 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన 'సాగిపోయే ఖాళీలు' కథ బాగుంది. నిజాయితీగా సంపాదించే వాళ్ల కష్టాలు తీరకున్నా, క్రమంగా సంపాదించే వాళ్లకు కష్టాలు లేకున్నా, జీవితం బుద్బుదప్రాయమనే సందేశం తలమానికం. 'మూలగది' కథ పుస్తక పఠనం ప్రాధాన్యాన్ని చక్కగా తెలియజెప్పింది.

-యం.బాలగంగాధరయ్య, హైదరాబాద్.

## అలరించిన సంచిక

వార్త ఆదివారం మేగజైన్ జూలై 23 సంచికలో 'ఆహారభద్రత' గురించిన 'సంఘీభావం' ఎన్నో విషయాలు తెలియజేసింది. ఆహారాన్ని వృధాకాకుండా భద్రపరచుకోవటం ఎంతైనా అవసరం. మూడోకన్ను, డ్రగ్స్ గురించిన కవర్ కథనం, పేరెంట్స్ డే ఆర్టికల్, మూలగది కథ వగైరాలన్నీ ఎంతోనచ్చాయి.

-కన్నెగండ్ల.హరనాథ్, నర్సరావుపేట.

## సమయోచిత కవర్ కథనం

జూలై 23 వార్త ఆదివారం మేగజైన్‌లో కవర్ స్టోరీ 'డ్రగ్స్ పడగ' సమయోచితంగా ఉంది. కార్టూన్‌లు విషయపరంగా బాగున్నాయి. ఐతే చిత్రీకరణ మరింత మెరుగ్గా ఉండాలి. కవితలు బాగున్నాయి. 'ఆమె నవ్వింది' కథ హృదయాన్ని కదిలించింది. జగపతిబాబు సినీ విశేషాలు అలరించాయి. 'సాహిత్యంలో ప్రేమ' ఆర్టికల్ విశ్లేషణాత్మకంగా ఉండి ఆలోచింపచేసింది.

-శివలెంక చంద్రశేఖర్, మెహదీపట్నం; డా.శివ భూషణం, కర్నూలు.

## ఆలోచింపజేసింది..

జూలై 23 వార్త ఆదివారం మేగజైన్‌లో 'భావవీచిక' లో నట్వర్‌భాయ్ పటేల్ దంపతుల నిజాయితీ ఎంతైనా ప్రశంసనీయం. ఆహార నష్టనివారణతోనే ఆహార భద్రత సాధ్యమన్న 'సంఘీ'భావం అక్షరసత్యం. డ్రగ్స్ గురించిన కవర్ కథనం ఆలోచింపజేసింది. 'సాగిపోయే ఖాళీలు' రచయితకు అభినందనలు. బ్యాక్ కవర్ మమ్ముల్ని ఆహ్లాదభరితుల్ని చేసింది.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం.

'సంఘీ'భావం

# సంపూర్ణ ఆహారంతోనే ఆరోగ్యం!



మనిషి ఆయుష్షును పెంచే సంపూర్ణ ఆరోగ్యానికి సంపూర్ణ ఆహారమే సరైన ఔషధమని పూర్వకాలం నుంచే అంతా చెప్తున్నారు. కానీ ఆచరణకు వచ్చేసరికి అనారోగ్యానికి దారితీసే ఆహారాన్నే అంతా తీసుకుంటున్నాం. ఫలితంగా జీవనశైలి వ్యాధులతో ప్రజలు అల్లాడిపోతున్నారు. కానీ అసలు సంపూర్ణ ఆహారం అంటే ఏమిటి? ఏ ఆహారాన్ని తినాలి? ఎంత తినాలి? ఎప్పుడు తినాలి? అనేదానిపై ప్రజల్లో అవగాహనే లేదు. ప్రభుత్వం కూడా సంపూర్ణ ఆహారంపై విధాన నిర్ణయాలేవీ ప్రకటించలేదు. ఈ కారణంగానే చిన్నపిల్లల నుంచి వృద్ధుల వరకు అనారోగ్యానికి దారితీసే ఆహారాన్ని తీసుకుంటూ జబ్బుల పాలవుతున్నారు.

గ్రామీణ ప్రాంతాల్లోని నిరక్షరాస్యుల నుంచి పట్టణ, నగర ప్రాంతాల్లోని విద్యాధికులకు కూడా సంపూర్ణ పోషకాహారంపై అవగాహన లేదు. ఇదే ఇటీవల ఇండియన్ మార్కెట్ రీసెర్చ్ బ్యూరో అధ్యయనంలో వెల్లడైంది. భారతదేశంలోని ప్రధాన నగరాల్లో ప్రజల ఆరోగ్యాన్ని ఈ బ్యూరో పరిశీలించింది. 60 నుంచి 90 శాతం దాకా వివిధ నగరాల ప్రజలు ప్రొటీన్ లోపంతో బాధపడుతున్నారని దీనివల్ల రోగ నిరోధక వ్యవస్థ దెబ్బ తింటున్నదని ఆ నివేదిక హెచ్చరించింది. ఇది అన్ని వర్గాల ప్రజల్లో మరోసారి పోషకాహారంపై చర్చకు దారి తీసింది. ప్రొటీన్లు, మినరల్స్, విటమిన్స్, ఫైబర్ సమపాళ్లలో ఉండే ఆహారమేమిటో 70 శాతం ప్రజానీకానికి తెలియదని ఈ సర్వే సంచలనంగా వెల్లడించింది. ఉత్తర ప్రదేశ్ రాజధాని లక్నోలో 90, చెన్నైలో 84, అహమ్మదాబాద్‌లో 83, హైదరాబాద్‌లో 70, ముంబైలో 65, బెంగళూరులో 60, ఢిల్లీలో 50, కోల్‌కతాలో 43 శాతం ప్రజలు ప్రొటీన్ల లోపంతో వ్యాధుల బారిన పడుతున్నారని ఆ సర్వే వెల్లడించింది. దైనందిన జీవితంలో ప్రజలు ఉదయాన అల్పాహారం, మధ్యాహ్నం లంచ్, రాత్రి డిన్నర్‌లో ఏ మోతాదులో సమతుల ఆహారం తీసుకోవాలో తెలియక వివిధ రకాల శారీరక, మానసిక వ్యాధుల బారిన పడుతున్నారు.

ఇంట్లో ఫుడ్ చార్ట్ ఖచ్చితంగా ఉండాలని దాని ఆధారంగానే ఇంట్లో ఆహారం తయారయితే తప్ప సంపూర్ణ ఆహారం అందే పరిస్థితి కనిపించడం లేదు. ఆహారాన్ని ఔషధంగా అంటే మితంగా సమపాళ్లలో తీసుకోవాలి. లేదంటే ఔషధమే విషంగా మారుతుందని ప్రతి ఒక్కరు గ్రహించాలి. తల్లి చనుబాల నుంచి మొదలుకొంటే సాంప్రదాయిక ఆహారంలో క్యాలరీ విలువలు ప్రతిఒక్కరు తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. అయితే ఏ ఆహారంలో ప్రొటీన్‌లు, విటమిన్లు, మినరల్స్, ఫైబర్ పుష్కలంగా ఉంటాయో తెలియకపోవడమే అన్ని సమస్యలకు ప్రధాన కారణంగా నిలుస్తున్నది.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, మందులు, చికిత్సలు లేని తాత, ముత్తాతల కాలంలో వారు తినే ఆహారం వారిని ఆస్పత్రులకు వెళ్లనిచ్చేవి కావు. ముఖ్యంగా రాగులు, సజ్జ, జొన్న, కొర్రలు, సామలు, ఉలవలు లాంటివి పురాతన కాలంలో పూర్వీకులు తీసుకునేవారు. వీటితో వారికి సంపూర్ణ ఆహారం అందేది. ఆసుపత్రులు, మందులు తెలిసేవి కావు. కానీ నేడు చిన్న పిల్లల నుంచి వృద్ధుల వరకు మెడికల్ కిట్లతోనే బతుకును తెల్లారుస్తున్నారు. నిద్ర నుంచి మొదలుకుంటే ప్రతి చిన్న సమస్యకు మందుగోలీలు తీసుకోవడం నిత్య జీవనంగా మారింది. రెడీ టు ఈట్ ఫుడ్, ప్యాకేజి ఫుడ్, కర్రీ పాయింట్లు ఇప్పుడు ఆధునిక జీవనంలో భాగంగా మారాయి. ఎంత త్వరగా ప్యాకెట్ తెచ్చుకుంటే అంత త్వరగా ఆకలి తీరుతుందని బిజీ లైఫ్ జీవులు అనుకుంటున్నారు. కానీ తాము తినే ఆహారంలో ఎంత కల్తీ, ఎంత విషముంది? అనేది గ్రహించలేక 34-40 ఏళ్లకే రోగగ్రస్తులవుతున్నారు.

ఆహారం విషయంలో అన్నీ వాదనలే. ముఖ్యంగా ప్రధాన ఆహారంగా బియ్యం తీసుకోవాలా? గోధుమలు తీసుకోవాలా? అనేది ఎవరికి తెలియడం లేదు. వైద్యులు, డైటీషియన్లు బియ్యాన్ని అధికంగా వాడ వద్దని చెప్తున్నారు తప్పితే ప్రత్యామ్నాయం ఏమిటనేది చెప్పలేకపోతున్నారు. చెప్పినా వాటిని బిజీ లైఫ్ జీవులు పాటించలేకపోతున్నారు. బియ్యంలో ఎక్కువగా పిండి పదార్థాలు ఉంటాయని అందరికీ తెలుసు. ఇందులో ప్రొటీన్లు, ఫైబర్ చాలా తక్కువ. కానీ దక్షిణాదిన ఇప్పటికీ ఇదే ప్రధాన ఆహారమైపోయింది. ఉత్తరాదిన బియ్యం వాడకం తక్కువ. కానీ అక్కడ స్వీట్ల వాడకం ఎక్కువ. అలాగే ఏ నూనెలు వాడాలో, దానిపై కూడా సరైన అవగాహన, చైతన్యం కరువైంది.

మంచినీళ్లు ఎప్పుడు ఎలా తాగాలో ఏది ఆరోగ్యకరమో తెలియని పరిస్థితి ఏర్పడింది. ఇక తీసుకునే ఆహారం ఒకేసారి కాకుండా కొద్ది మొత్తంలో ఎక్కువ సార్లు తీసుకోవాలని డైటీషియన్లు సలహా ఇస్తున్నారు. కానీ అలా ఆహారం తీసుకునే సమయం ఆధునిక జీవులకు చిక్కడం లేదు. ఆహారం తీసుకునే సమయాల్లో కూడా వివిధ వర్గాల్లో వివిధ రకాల అలవాట్లు ఉన్నాయి. హైదరాబాద్‌లో డైట్‌పై సంపూర్ణ అవగాహన పెంచే శాస్త్రీయ సంస్థ ఉంది. ఆ సంస్థ సమగ్ర పోషకాహారంపై పుస్తకాలను ముద్రిస్తున్నది. కానీ అవి ప్రజలకు అందుబాట్లోకి రావడం లేదు. ఇలాంటి సంస్థలు విలువైన సమాచారంతో కూడిన డైట్ పుస్తకాలను దేశంలోని అన్ని ప్రధాన భాషల్లోకి అనువదించి అందరికీ అందేలా చూస్తే కొంత ప్రయోజనం ఉంటుంది.

ముఖ్యంగా ప్రొటీన్ల లోపం ఇప్పటి సమస్య కావడంతో అసలు 100 గ్రా. ఆహారంలో ఎంత ప్రొటీన్ ఉందో తెలుసుకుంటే ఆ మేరకు ప్రజల్లో పోషకాహార అవగాహన పెరిగే అవకాశం ఉంది. మనం నిత్యం వాడే పదార్థాల్లో కార్బోహైడ్రేట్స్ ఎక్కువగా ఉంటున్నాయి. ఫైబర్లు, ప్రొటీన్లు కనిపించడంలేదు. అత్యధికంగా సోయాబీన్లు 100 గ్రా. తీసుకుంటే ఇందులో 36 శాతం ప్రొటీన్లుంటాయి. చికెన్‌లో 20 శాతం, బాదంపప్పు, జీడిపప్పులో 23, కేసరిపప్పులో 26, వేరుశెనగల్లో 25, ఉలవల్లో 25, శెనగల్లో 25, పెసర, మినపల్లో 24, కందిలో 22.3, చేపలు, మాంసంలో 20, రాజ్‌మాలో 23, గుడ్డులో 13 శాతం ప్రొటీన్లున్నాయి. ముఖ్యంగా డ్రై ఫ్రూట్స్, కీర దోస, మష్రూమ్స్, యాపిల్స్, పాలు, పెరుగు, గుడ్లు, వెన్న, పాలకూర, తోటకూర, బచ్చలికూర, టమాటాలను నిత్యం ఆహారంలో భాగం చేసుకుంటే సంపూర్ణ ఆరోగ్యం సాధ్యమవుతుంది.

ఇంటిల్లిపాదికి ఆహారంపై అవగాహన రావాలంటే ప్రతి ఇంట్లో కిచెన్‌లో, డైనింగ్‌రూమ్‌లో ఫుడ్ చార్ట్స్ ఖచ్చితంగా ప్రదర్శిస్తే తప్ప ఆహార పదార్థాల అవగాహన రావడం కష్టమే!

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




# నితీశ్ కథలో నీతి?

- ఎ.వి.వి. ప్రసాద్

**బీహార్ రాజకీయ ప్రయోగంలో లాభ నష్టాల బేరీజు వేస్తే బిజెపి ఎంత దూరదృష్టితో వ్యవహరిస్తున్నదో అర్థమవుతుంది. లాలూ పశుగ్రాస కుంభకోణంపై సుప్రీంకోర్టు ఇప్పటికే పునర్విచారణ ప్రారంభించడంతో రాజకీయంగా ఆయన ప్రతిష్ట మరింత మసకబారింది. ఆయన కుమారునిపైనా అనేక అవినీతి ఆరోపణలున్నాయి గనుక జెడియు, ఆర్‌జెడి కూటమి విచ్ఛిన్నమైతే అది తనకే లాభమని బిజెపి గ్రహించింది కనుకనే తక్షణమే మద్దతు ప్రకటించి ప్రభుత్వంలోకి దూసుకు వచ్చింది. 2015 ఎన్నికల ముందునాటి మాటలకే నితీశ్ కట్టుబడి ఉంటే తాజాగా ఎన్నికలకు వెళ్లి ఉండేవారు. అప్పుడు ప్రజలు ఎవరిని ఎన్నుకుంటే వారు అధికారంలోకి రావచ్చు. జెడియు, కాంగ్రెస్, ఆర్‌జెడి, బిజెపి... ఎవరు ఎవరితో కలిసి అధికారంలోకి వచ్చినా ప్రజలకు అదనంగా ఒరిగేదేమీ ఉండదన్నది వాస్తవం. అన్ని పార్టీలు సిద్ధాంతాలకు ఎప్పుడో తిలోదకాలిచ్చేశాయి. ఏదోవిధంగా అధికారంలో కొనసాగడమే ఇప్పటి ప్రజాస్వామ్య ధర్మంలా కనిపిస్తుంది...**

**పదవి కొరకు కొత్త బంధాలు కనిపెట్టు,**
**పాత పగలు మరచి పర్వులెత్తు;**
**రాజకీయమనిన రంజైన ఆటరా!**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

నితీష్ వెళ్లాడు.. నితీష్ వచ్చాడు.. మధ్యలో 24 గంటలు. నిజానికి ఒక్క సెకను చాలు- రాజకీయాలలో ఎంత పెద్ద పరిణామమైనా సంభవించడానికి. కానీ మర్యాద కాదనో, ఏమో! ఓ 24 గంటలు వ్యవధి ఇచ్చారు. ఈలోగా ఎంత మేజిక్ జరగాలో అంతా జరిగిపోయింది. ఒక మహాకూటమి బద్దలయింది. మరో అవకాశవాద కూటమి అందలం అధిరోహించింది. దూరం నుంచి చూసేవారికి అదో తోలుబొమ్మలాటలా కనిపించి ఉండవచ్చు. అయితే రాజకీయాల్లో తల పండినవారికి అందులో అనైతికం ఏదీ కనిపించి ఉండకపోవచ్చు. కేవలం అధికారంకోసం ఏర్పడే కూటములు ఎంత బుద్బుదప్రాయమో చెప్పడానికి బీహార్ రాజకీయ చిత్రమే చక్కని ఉదాహరణ. లాలూ యాదవ్‌తో బంధాన్ని తెగతెంపులు చేసుకొని మరోసారి బిజెపితో జతకట్టిన నితీష్ వ్యూహం ఆధునిక ప్రజాస్వామ్య చరిత్రలో ఒక సరికొత్త ప్రయోగమనే చెప్పాలి. బిజెపి కేంద్రంలో పూర్తి మెజారిటీతో అధికారంలోకి వచ్చిన తర్వాత గత మూడేళ్లలో జరిగిన విచిత్రమైన రాజకీయ ప్రయోగాలలో బీహార్ పరిణామాలను ఓ కొత్త మలుపుగానే చెప్పవలసి ఉంటుంది.



బిజెపికి ప్రేరణాత్మకమైన నినాదం ఒకటి ఉంది. అది 'ఘర్ వాపసి'. ఎవరు ఏ పార్టీలో ఉన్నా వారిని ఏదో విధంగా ఆకర్షించి బిజెపి గూటికి చేర్చడం- ఆ పార్టీ నేతలందరికి ఓటుతో పట్టిన విద్య అనే చెప్పాలి. లోక్‌సభలో ఉన్న పూర్తి మెజారిటీ బలంతో రాజ్యసభలో కూడా బలం పెంచుకోవడం, దాదాపుగా అన్ని రాష్ట్రాలలో 'కమల వికాసా'నికి పాదులు తీయడం గత మూడేళ్లుగా జరుగుతున్న పనే. ఆ కోణంనుంచి చూస్తే బిజెపికి ఈ ప్రయోగం కొత్తదిలా అనిపించకపోవచ్చు. కానీ తెల్లారితేచాలు నీతి సూత్రాలు వినిపించే నితీష్ హఠాత్తుగా కూటమిని మార్చేయడమే కొంచెం ఆశ్చర్యంగా కనిపిస్తుంది.

రెండు సంవత్సరాల క్రితం బీహార్ అసెంబ్లీకి ఎన్నికలు జరిగినపుడు 'బిజెపి విస్తరణ'ను అడ్డుకోవడానికి ఒక 'మహాకూటమి' ఉద్భవించింది. దానిలో కీలక నేతలు ఆర్‌జెడి చీఫ్, జెడి(యు) అధినేతలు నితీశ్, శరద్‌యాదవ్‌లు. భిన్న ధ్రువాలే అయినా ఆ రెండు పార్టీలు జతకట్టడం అప్పట్లో ఒక వింతగానే కనిపించింది. కాంగ్రెస్ వంటి నేల దూరమైపోతున్న ప్రధాన పార్టీలు కూడా వారితోనే కలిసి నడవాలని నిర్ణయించుకున్నాయి. అప్పటికి ఆ ప్రయోగం గొప్ప విజయాన్నే సాధించింది. 2014 పార్లమెంటు ఎన్నికలకు ముందు బిజెపి ప్రచార నాయకత్వాన్ని మోడీకి అప్పగించడంతో నితీశ్ 17 సంవత్సరాల అనుబంధాన్ని తెగతెంపులు చేసుకొన్నారు. అది ఆయన వ్యక్తిగత అంశమే కావచ్చు. అప్పటిదాకా లాలూను తీవ్రంగా వ్యతిరేకించిన నితీశ్ బిజెపి నుంచి బయట పడ్డాక తిరిగి అదే లాలూతో చేతులు కలిపి, మరికొన్ని చిన్న పార్టీలతో కలిసి 'మహా ఘట బంధన్'ను రూపొందించారు. బీహారీలు దానిని కూడా సరిపెట్టుకొని ఆ కూటమికి చక్కని విజయాన్నే ఇచ్చారు. అయితే 20నెలలు గడవకముందే ఆ కూటమి మళ్లీ ముక్కలై, నితీశ్ మరోసారి 'కమలా'న్ని చేతుల్లోకి తీసుకొన్నారు. ఇవన్నీ ఆయన వ్యక్తిగతమే అనుకుంటే, ఓట్లు వేసి గెలిపించిన ప్రజలను ఏమనుకోవాలి?

లాలూతో బంధాన్ని తెంచుకొనడానికి నితీశ్ చెబుతున్న కారణాలు నిజంగానే నవ్వు తెప్పిస్తాయి. మహాకూటమి జరిగినప్పుడే కుదిరిన ఒప్పందం ప్రకారం లాలూయాదవ్ కుమారుడు తేజస్వి యాదవ్‌కు డిప్యూటీ సిఎం పదవి ఇవ్వడంతో నిజానికి ప్రభుత్వంలో ఆయన ప్రభావమే ఎక్కువగా కనిపిస్తూ వచ్చింది. తేజస్విపై అవినీతి ఆరోపణలు కూడా పెరిగిపోయాయి. నితీశ్‌కు ఆ విషయాలూ తెలుసు. కూటమి ఏర్పడకముందే లాలూయాదవ్‌పై గల అవినీతి కేసులూ ఆయనకు తెలుసు. ఇంకా లోతుగా చెప్పాలంటే నితీశ్‌పై కూడా చాలా అవినీతి ఆరోపణలున్నాయి. కానీ ఇద్దరు బద్ధ శత్రువులు ఒక 'సర్కిల్'లోకి రావాలనుకున్నారు, వచ్చారు. వచ్చినప్పటి నుండి తేజస్వి 'పాత్ర' కూటమిలోను, ప్రభుత్వంలోను పెరిగిపోతూ రావడం, దానిని లాలూ గాని, నితీశ్‌గాని కంట్రోల్ చేయలేకపోవడంతో చివరికి కూటమి మళ్లీ ముక్కలయ్యే పరిస్థితి తలెత్తింది. ఆ అవకాశాన్ని బిజెపి చాలా చక్కగా ఉపయోగించుకొని అధికారంలో తన 'వంతు' పంచుకొంది. పిట్టపోరు, పిట్ట పోరు పిల్లి తీర్చిన రీతిలో బిజెపి బీహార్‌లో ఇప్పుడు పాగావేసింది. ఒక రకంగా చెప్పాలంటే ఈ మొత్తం గేమ్‌లో లాభ పడింది నితీశ్ కాదు.. బిజెపియే. నిన్నటి దాకా తేజస్వి నితీశ్‌పై పెత్తనం చెలాయిస్తే, ఆ సీటులో ఇప్పుడు సుశీల్ కుమార్ మోడీ కూర్చున్నాడు. అంతే తేడా. నితీశ్ 'ఘర్ వాపసీ'ని ఎవరూ ప్రశ్నించలేకపోవచ్చు. కానీ, ప్రజలకు ఏదో ఒక కూటమిని అంటగట్టడం ఎటువంటి నైతిక ధర్మమనిపిస్తుంది! కొత్త కూటమి ఏర్పడగానే జూలై 27న జరిగిన విశ్వాస పరీక్షలో నితీశ్ తేలికగానే విజయం సాధించడం అనూహ్యమైనదేమీ కాదు. కూడికలు, తీసివేతలు అన్నీ అనుకున్నట్లే ఫలితాలనిచ్చాయి. మొత్తం 243మంది ఎమ్మెల్యేల్లో జెడియు, బిజెపిసంకీర్ణానికి 131 మంది



ఓటేయగా, 108 మంది వ్యతిరేకించారు. 2015 అసెంబ్లీ ఎన్నికల్లో ప్రజలు బిజెపికి వ్యతిరేకంగా తీర్పునిస్తే, ఇప్పుడదే బిజెపిని నితీశ్ ప్రభుత్వంలో భాగస్వామిని చేశారు. అంటే ఇక్కడ ప్రజల తీర్పుకు తూర్పు చూపించినట్లే కదా!

**********

బీహార్ రాజకీయ ప్రయోగంలో లాభ నష్టాల బేరీజు వేస్తే బిజెపి ఎంత దూరదృష్టితో వ్యవహరిస్తున్నదో అర్థమవుతుంది. లాలూ పశుగ్రాస కుంభకోణంపై సుప్రీంకోర్టు ఇప్పటికే పునర్విచారణ ప్రారంభించడంతో రాజకీయంగా ఆయన ప్రతిష్ట మరింత మసకబారింది. ఆయన కుమారునిపైనా అనేక అవినీతి ఆరోపణలున్నాయి గనుక జెడియు, ఆర్‌జెడి కూటమి విచ్ఛిన్నమైతే అది తనకే లాభమని బిజెపి గ్రహించింది కనుకనే తక్షణమే మద్దతు ప్రకటించి ప్రభుత్వంలోకి దూసుకు వచ్చింది. 2015 ఎన్నికల ముందునాటి మాటలకే నితీశ్ కట్టుబడి ఉంటే తాజాగా ఎన్నికలకు వెళ్లి ఉండేవారు. అప్పుడు ప్రజలు ఎవరిని ఎన్నుకుంటే వారు అధికారంలోకి రావచ్చు. జెడియు, కాంగ్రెస్, ఆర్‌జెడి, బిజెపి... ఎవరు ఎవరితో కలిసి అధికారంలోకి వచ్చినా ప్రజలకు అదనంగా ఒరిగేదేమీ ఉండదన్నది వాస్తవం. అన్ని పార్టీలు సిద్ధాంతాలకు ఎప్పుడో తిలోదకాలిచ్చేశాయి. ఏదో విధంగా అధికారంలో కొనసాగడమే ఇప్పటి ప్రజాస్వామ్య ధర్మంలా కనిపిస్తుంది. నితీశ్ 2015 ఎన్నికలకు ముందు బిజెపిని ఒక పురుగును చూసినట్లు చూశారనడానికి ఆయన చేసిన వ్యాఖ్యలే ఉదాహరణ. 'బిజెపి అంటే ఆర్‌ఎస్‌ఎస్ రాజకీయ విభాగం. స్వయం సేవకులు, ప్రచారక్‌లు ప్రభుత్వంలో భాగస్వాములుగా ఉన్నారు. బిజెపిలో ఆరెస్సెస్ చెప్పిందే వేదం. 'సంఘ్ విముక్త్ భారత్' కోసం బిజెపియేతర పార్టీలన్నీ ఏకంకావాలి. ప్రధాని సీటులో ఉన్న మోడీ నా డిఎన్‌ఎను ప్రశ్నించారు, లాలూను సైతాన్ అన్నారు' అంటూ పదేపదే ప్రతి ప్రసంగంలోను నితీశ్ బిజెపిపై, మోడీపై నిప్పులు కక్కారు. అది అయిపోయింది. మహాకూటమి బీహార్‌లో అధికారంలోకి వచ్చింది. ఏదో నడుస్తున్నది గదా! అనుకుంటే- లాలూ, నితీశ్ మధ్య మళ్లీ విభేదాలు మొలకెత్తి అవి మహాకూటమి విచ్ఛిన్నానికి దారి తీశాయి. చివరికి నితీశ్ రాజీనామా చేయవలసి వచ్చింది. ఆయన తన రాజీనామాను జూలై 26న ఇలా ప్రకటించిన తక్షణమే బిజెపి ముందుకు వచ్చి మద్దతు ప్రకటించింది. అప్పుడు నితీశ్‌కు 2015 ముందు నాటి పరిస్థితి గుర్తుకు రానేలేదు. వెంటనే బిజెపితో చేతులు కలిపేశారు. మళ్లీ గవర్నర్ వద్దకు వెళ్లారు, బలం నిరూపించుకొంటానన్నారు. ఈ 'ఆట' అందరికి తెలిసినదే. గవర్నర్ సరేనన్నారు, తర్వాత జరిగిన విశ్వాసపరీక్షలో సునాయాసంగా నితీశ్ గట్టెక్కారు. ఈ మొత్తం వ్యవహారం వెనుక బిజెపి పాచిక లేదని ఎవరనగలరు! బిజెపియేతర ప్రభుత్వాలున్న ప్రతిరాష్ట్రంలోను ఇదే ప్రయోగం మొదలయితే ఇక ఎన్నికలెందుకు? కోట్ల కోట్ల ప్రజాధనం నీళ్లలో కలిపివేయడమెందుకు?



బీహార్‌లో నితీశ్‌కుమార్ అత్యంత ప్రజాదరణ ఉన్న నాయకుడే. ఎన్నిసార్లు ప్లేటు ఫిరాయించినా 'ఒక మంచి నేత' అనిపించుకొన్నవాడే. కానీ 1990 నుంచి ఆయన వేసిన కప్పదాట్లు అన్నీ ఇన్నీ కావు. 'నాకు బిజెపి అంటే ఇష్టం. నేను దానిలో ఉంటా' అనిఆయన ప్రకటిస్తే దానిని ఎవరూ కాదనరు. అది ఆయన ఇష్టం. ఆయన వెళ్లి బిజెపిలోనే చేరినా ఎవరూ వద్దనరు. కానీ ప్రభుత్వంలో కూటమిని మార్చేసి అధికారంలో కొనసాగడమే నిజమైన ప్రజాస్వామ్యవాదులకు మింగుడుపడకుండా ఉంది. తానే ఏర్పాటు చేసిన మహాకూటమి ప్రభుత్వాన్ని కాదని, బిజెపితో కలిసి ప్రభుత్వంలో కొత్తకూటమిని తయారుచేయడమే విమర్శలకు గురవుతోంది. విశ్వాస పరీక్షలో నెగ్గిన సందర్భంలో ఆయన చెప్పిన మాటలు వింటే మరింతగా నవ్వు వస్తుంది. 'రాష్ట్ర భవిష్యత్తు కోసమే బిజెపితో చేతులు కలిపాను. కేంద్రం, రాష్ట్రంలో ఒకే ప్రభుత్వం ఉంటే రాష్ట్రాభివృద్ధి బాగా జరుగుతుందని నా విశ్వాసం' అన్నారు. మరి 2015లో ఆయన 'విశ్వాసం' మరో విధంగా ఉంది. ఇప్పుడిలా మారింది. ఎన్నికలకు వెళ్లి ఉంటే ప్రజలు తమకిష్టమైతే బిజెపినే ఎన్నుకో వచ్చు. లేదా ఏ కాంగ్రెస్‌కో అవకాశమూ ఇవ్వవచ్చు. ప్రభుత్వాన్ని ఏ పార్టీ నడపాలన్నది ప్రజల ఇష్టానిష్టాల ప్రకారమే జరగాలిగాని నేతల అవసరాలకొద్దీ జరిగితే ఎలా? ఇలాంటి ప్రయోగాలు జరుగుతూ పోతే ఇక ప్రజాస్వామ్యానికి విలువేం ఉంటుంది? కాంగ్రెస్ మోదువారిన నేపథ్యంలో, 2019 ఎన్నికల్లో ప్రధాని నరేంద్ర మోడీని, బిజెపిని ఢీకొట్టగలిగిన నేత దేశంలో ప్రస్తుతం తానొక్కడినే అని కూడా నితీశ్ గతంలో అన్నారు. ములాయం, లాలూ, మాయావతి, మమతల వంటి పెద్ద నేతలందరి కంటె తానే పెద్దవాడిననికూడా నితీశ్ పలుమార్లు చెప్పారు. కానీ రాజకీయ పరిస్థితులను సకాలంలో అర్థం చేసుకొన్నందువల్లనో ఏమో! పెద్దనోట్లరద్దును స్వాగతించడం, రాష్ట్రపతి ఎన్నికలో కోవింద్ అభ్యర్థిత్వాన్ని సమర్థించడం వంటి విధానాలతో 'రూటు' మార్చుకొంటూ వచ్చారు. రెండేళ్లలో వచ్చే సాధారణ ఎన్నికల్లో బిజెపితో కలిసి ఉంటేనే చివరికి రాజకీయ మోక్షం సిద్ధిస్తుందనుకొన్నారు. బహుశా అందుకే కావచ్చు. ఆ పార్టీతో చాలా తేలికగానే చేతులు కలిపేశారు.

ఇక్కడ గమనించవలసిన విషయాలు మరికొన్ని ఉన్నాయి. 1994లో లాలూతో విభేదించి సమతా పార్టీ ఏర్పాటు చేసుకొన్న నితీశ్ 1996లో బిజెపితో పొత్తు పెట్టుకొన్నారు. 2005- 13 మధ్య బిజెపితో కలిసి బీహార్‌లో ప్రభుత్వాన్ని నడిపారు. అయితే తనకంటె మోడీకే బిజెపి పట్టం కట్టేలా కనిపించడంతో ఆ పార్టీకి గుడ్‌బై చెప్పి లాలూ, కాంగ్రెస్‌తో కలిసి 2015 ఎన్నిలకలకు ముందు మహాకూటమిని ఏర్పాటుచేశారు. తాజాగా లాలూకు గుడ్ బై చెప్పి మళ్లీ మోడీకి జైకొట్టారు. ఈ ప్రస్థానాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే మొత్తం ఆరుసార్లు సిఎం అయినప్పటికి ప్రతిసారీ అవకాశవాద రాజకీయాలకే నితీశ్ ప్రాధాన్య మిచ్చినట్లుగా కనిపిస్తుంది. దీనితో 2019 ఎన్నికల్లో బిజెపికి మరో అడ్డు కూడా తొలగిపోయినట్లే అనిపిస్తుంది. నితీశ్ లేని లాలూ, కాంగ్రెస్‌లు నీటిపాముల వంటివే. అంటే బీహార్ కూడా 2019లో బిజెపి బుట్టలోకే చేరుతుంది. తాజాపరిణామాలతో బిజెపి నేరుగా, సంకీర్ణంగా మొత్తం 18 రాష్ట్రాలలో ఉన్నట్లే. 'కాంగ్రెస్ ముక్త్ భారత్' అనే తన నినాదాన్ని దాదాపు అన్ని రాష్ట్రాల్లోకి తీసుకువెళ్లినట్లే. ఈ రాష్ట్రాలన్నిటిలో 340 లోక్‌సభ సీట్లున్నాయి. ఇంకా రెండేళ్ల వ్యవధి ఉన్నది గనుక మరికొన్ని రాష్ట్రాలలో కూడా కొన్ని సీట్లను పెంచుకోగలిగితే దేశ ప్రజాస్వామ్య ఎన్నికల చరిత్రలోనే బిజెపి అనూహ్యమైన రికార్డును సొంతంచేసుకోవచ్చు. బహుశా మోడీ, నితీశ్‌ల ప్రణాళిక కూడా అదే అయి ఉంటుంది. కానీ ఆయా రాష్ట్రాలలో రాజకీయ నైతికవిలువలకు మాత్రం తిలోదకాలివ్వడం జరుగుతోంది. గుజరాత్‌లో కొద్దిగా కనిపిస్తున్న కాంగ్రెస్ క్రమంగా కనుమరుగయ్యే సూచనలు కనిపిస్తున్నాయి. దక్షిణాదిలో ఆ పార్టీ అడ్రస్ లేకుండా పోతోంది. కుదిరితే నేరుగా అధికారం, కుదరకపోతే సంకీర్ణం అన్నదొకటే బిజెపి లక్ష్యంగా కనిపిస్తోంది. రాజకీయవ్యూహాలు మారిపోతున్నాయి. రాజనీతికి అర్థం మారిపోతున్నదనడానికి ఇటువంటివే ఉదాహరణలు. నితీశ్‌లాంటివారు ఇంకో ఇద్దరు, ముగ్గురు దొరికితే అన్ని రాష్ట్రాలు 'కమల' దళాలే అవుతాయేమో!



# 'నేత'ల వెతలు కన్నీటి కతలు

ఆగస్టు 7 జాతీయ చేనేత దినోత్సవం

కవర్‌స్టోరీ

ఆర్.తిరుమలరావు
రిపోర్టర్, స్టేట్‌బ్యూరో.

మనిషి కనీస అవసరాలలో కడుపునింపే పట్టెడన్నం తర్వాత రెండో స్థానంలో నిలిచేవి శరీరానికి రక్షణనిచ్చే దుస్తులు. అందుకే 'అన్నవస్త్రా'లనే పదం వాడుకలోకి వచ్చింది. వస్త్రాలలో చేనేత వస్త్రమే అన్నివిధాల శ్రేష్ఠమైనదని విజ్ఞులు చెప్పటమూ తెలిసిందే. మరి అటువంటి చేనేత వస్త్రాలనందించే నేతపనివారల పరిస్థితి కడు దయనీయంగా మారి, చివరాఖరుకు ఆత్మహత్యలకు పాల్పడి, మరణాన్ని ఆశ్రయించటం ఎంతటి విషాదం! రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ మగ్గాలనే నమ్ముకున్న నేతన్నలు పేదరికంలో మగ్గుతూనే ఉన్నారు. ఈ నేపథ్యంలో మనదేశంలో నాటి నుంచి నేటి వరకు చేనేతల పూర్వాపరాలు, కష్టనష్టాలలో కూరుకుపోయి, అప్పుల ఊబిలో దిగబడి..దాన్నుండి బయటపడే దారీతెన్నూ కానరాక నిరాశ, నిస్పృహలతో కొట్టుమిట్టాడుతోన్న వారి జీవితాల వెతలు, చేనేతరంగం పతనదశకు చేరుకోవటానికి కారణాలు..ప్రభుత్వాలు అందిస్తోన్న సహాయ సహకారాల వివరాలు.. వగైరా, వగైరా ఈవారం మీకోసం..

మన దేశంలో వ్యవసాయం తరువాత గ్రామీణ రంగంలో ఎక్కువగా ఉపాధి కల్పించే రంగం చేనేత వస్త్రాలది. రెండు తెలుగు రాష్ట్రాలలో చేనేత రంగంపై ప్రత్యక్షంగా పరోక్షంగా సుమారు రెండు లక్షల నుంచి మూడు లక్షల వరకు మగ్గాలు ఉండగా, వీటిపై సుమారు నాలుగు నుంచి ఐదు లక్షల మంది ఆధారపడి తమ జీవనాన్ని గడుపుతున్నారు. అయితే వీరికి ఈ రంగమే జీవనాధారం, జీవితం. ఇది తప్ప వారికి ఇతర ప్రపంచంతో సంబంధం ఉండదు. ఎలాంటి సాంకేతిక పరిజ్ఞానం వచ్చినా పాత పద్ధతుల్లోనే పనులు చేసుకుంటూ జీవితాలను గడుపుతున్నారు. ఎలాంటి ఆధునిక పరిజ్ఞానం వచ్చినా...చేనేతకు ఉన్న డిమాండ్ గానీ, చేనేత వస్త్రాలకు ఉన్న ప్రాధాన్యత తగ్గడం లేదు. వన్నెతగ్గకుండా మన్నికైన వస్త్రాలను నేస్తూ చేనేత కార్మికులు తమ నైపుణ్యంతో భారతీయ వస్త్రాలకు ప్రపంచ స్థాయి ఖ్యాతిని తెచ్చిపెట్టారని చెప్పవచ్చు.

పోచంపల్లి, గద్వాల, ధర్మవరం, మంగళగిరి, వెంకటగిరి, నారాయణపేట ఇలా వాటి పేర్లు చెప్పగానే వస్త్రాలు వాటి మన్నికను చెప్పొచ్చు. పోచంపల్లి, గద్వాల, ధర్మవరం పేర్లు వింటే నాజుకు వస్త్రాలు గుర్తుకువస్తాయి. అగ్గిపెట్టెలో ఇమిడే విధంగా చీరలను నేసిన ఘనత మన నేతన్నలకే దక్కుతుంది. ఇంత నాజూకు చీరలను నేసినప్పటికీ వారికి కడుపునిండటం లేదంటే ఆశ్చర్యం కలగక మానదు. ఎంత కష్టపడినా, రెండు పూటలా తినలేని పరిస్థితి వారిది. యాంత్రీకరణ నేపథ్యంలో ప్రభుత్వాలు చేనేతను నిర్లక్ష్యం చేయడంతో చేనేత రంగం మొత్తం సంక్షోభంలో కూరుకుపోయి నేతన్నల ఆత్మహత్యలకు కారణమైంది. ఎంత అందంగా నాణ్యతతో నేసినప్పటికీ ప్రయోజనం మాత్రం కనిపించడం లేదు. ప్రధానంగా వారు నేసిన వస్త్రాలకు ప్రచారం చేయడంలో గత ప్రభుత్వాలు విఫలం అయ్యాయి. దీంతో వారు నేసిన వస్త్రాలకు గిరాకీ లేక పోవడం, కుటుంబ పోషణ భారమై నేతన్నలు అప్పుల్లో కూరుకుపోయి వాటిని తీర్చలేక తుదకు ఆత్మహత్యలకు పాల్పడడం..



ఇప్పటికీ 8-10గంటలకు కుటుంబం మొత్తం మగ్గం, రాట్నం, ఆసు, పన్నె తదితర వాటిపై దృష్టిసారించి కష్టపడినా వారికి దినసరి కూలీ కూడా వెళ్లలేని పరిస్థితినెలకొంది. భారీ పరిశ్రమలకు ప్రాధాన్యత ఇవ్వడం, కుటీర పరిశ్రమ అయిన చేనేత విషయంలో నిర్లక్ష్యం చూపడంతో ఆశించిన స్థాయిలో ఫలితం కనిపించలేదు. మనదేశంలో రెండు వేల సంవత్సరాల మన ఆర్థిక వ్యవస్థలో మన సామాజిక, సాంస్కృతిక జీవనంలో భాగమైన చేనేత రంగాన్ని కాపాడుకోవడంలో కంటితుడుపు చర్యలు తప్ప శాశ్వత పరిష్కారం లేకపోయింది. ఇక తెలంగాణ విషయానికి వస్తే సిరిసిల్లలో జరిగిన ఆత్మహత్యలకు కారణం ఎవరికి వారు తాము కాదు అంటున్నారు. చేనేత రంగం ఉద్ధాన పతనాలకు సిరిసిల్లాయే ఒక ఉదాహరణ. వీరు 1920లో మహారాష్ట్రకు వెళ్లి నైపుణ్యం సాధించి, 1970 నాటికి సొంత మగ్గాలను నడిపించడం ప్రారంభించారు. 1990 సంవత్సరం నాటికి 12వేల మరమగ్గాలతో సిరిసిల్ల ప్రాంతం కళకళలాడింది.

అయితే ఆపైన కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానాలతో చేనేత రంగం విలవిలలాడిందని చెప్పొచ్చు. ఆర్థిక విధానాల కారణంగా ఈ రంగంపై మొదటి దెబ్బపడింది. ప్రభుత్వం నూలు ఎగుమతికి అనుమతి ఇవ్వడంతో ధరలు పెరిగాయి. కేంద్రం 9.25శాతం ఎక్సైజ్ సుంక విధించడంతో చేనేత కుటీర పరిశ్రమలు కుదేలయ్యాయి. మరోవైపు పెద్ద పరిశ్రమలకు అందినంత ప్రోత్సాహకాలు చేనేత పరిశ్రమకు అందకపోవడంతో కుటుంబాలు వీధినపడ్డాయి. పెద్ద పరిశ్రమలకు రాయితీలు ఇవ్వడం, ప్రోత్సాహకాలు కల్పించడం, ఎక్సైజ్ సుంకం తగ్గించడం, సాంకేతిక పరిజ్ఞానంలో ప్రభుత్వ సబ్సిడీలు ఇచ్చింది. దీంతో పెద కంపెనీలు నూలు తయారు చేయడం, నేయడం, రంగులు అద్దడంలాంటి పనులకు ఖర్చు తక్కువగా అవ్వడంతో అప్పటి వరకు ఆధారపడి ఉన్న చేనేత పరిశ్రమ ఒక్కసారిగా కుదేలు అయింది. నేతన్నలు అప్పుల ఊబిలోకి వెళ్లి ఆత్మహత్యల పరంపర మొదలైంది. నాయకులు వారి ఆత్మహత్యలను రాజకీయం చేసారే తప్ప వారి కన్నీటిని తుడవలేకపోయారు. అయిగే గతంతో పోలిస్తే రాష్ట్రం విడిపోయిన తరువాత చేనేతలను ఆదుకోవడానికి ప్రభుత్వం పలు ప్రోత్సాహకాలు కల్పించి, చేనేతకు పూర్వవైభవం కల్పించేందుకు అన్ని రకాల చర్యలను ప్రారంభించారు. అయితే ఇప్పుడిప్పుడే ఆర్థికంగా ఆదుకోవడానికి సహాయం అందిస్తున్నారని చెప్పవచ్చు.

## చేనేత దినోత్సవ నేపథ్యం..

1890 సంవత్సరంలో లాహోర్‌లో జరిగిన 19వ జాతీయ సభలో, విదేశీ వస్త్ర దిగుమతులు వలన స్వదేశంలోని చేనేత నిల్వలు పేరుకుపోయాయని, అందువల్ల స్వదేశీ వస్త్రాల ప్రదర్శన జరపాలని నిర్ణయించారు. 1905లో కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సభలో విదేశీ వస్త్ర బహిష్కరణ, స్వదేశీ వస్త్ర ఆచరణపై తీర్మానం చేశారు. 1905 ఆగస్టు 7వ తేదిన కలకత్తాలో చేనేత ఉద్యమం ప్రారంభమైంది. ఫలితంగా చేనేత వస్త్రాలకు ప్రాధాన్యత పెరగడంతో పాటు అదొక ఉద్యమం రూపం దాల్చిందని చెప్పవచ్చు. దాన్ని దృష్టిలో ఉంచుకునే ఆగస్టు 7వ తేదీని చేనేత దినోత్సవంగా ప్రభుత్వం ప్రకటించింది.

### స్వాతంత్ర్యానికి ముందు..

మన దేశానికి స్వాతంత్ర్యం రాకముందు బ్రిటిషు ప్రభుత్వం చేనేత వస్త్రాలపై నిషేదాలు విధించడం, వారిపై కక్ష సాధింపు చర్యలు చేపట్టింది. భారతీయ వస్త్ర కళా నైపుణ్యతకు తట్టుకోలేక ఇంగ్లాండ్ వర్తకులు మన దేశ వస్త్రాలను దిగుమతి చేయకుండా నిరోధించాలని డిమాండ్ చేయగా, ఇంగ్లాండ్ పార్లమెంట్‌లో 1700,1721,1773,1777,1813 సంవత్సరాలలో నిరోధక శాసనాలు సైతం చేశారు. ఇదే కాలంలో తమ దేశ వస్త్ర ఉత్పత్తులకు మార్కెట్ అవకాశాలు కోసం భారతదేశ వస్త్రాల దిగుమతులు నిరోధించుటకు ప్రత్యేక ఆందోళనలను దేశ్యాప్తంగా చేశారు. భారతదేశ వస్త్రాలను ధరించటం సిగ్గుచేటుగా పేర్కొంటూ అలా ధరించిన వారిని అల్లరిచేసి, అవమాన పరిచినట్లుగా మెకాలే, డానియల్ డిపోలాంటి వారి రచనలు తెలుపుతున్నాయి. భారతీయ వస్త్రాలపై దిగుమతి నిషేధ శాసనాలు చేసి భారతదేశంలోని ఈస్ట్ ఇండియా కంపెనీ ఏజెంట్లు, గుమాస్తాలు నిర్ణయించిన ధరలకు వస్త్రాలను ఇవ్వడానికి నిరాకరించిన వారిని ఒకచోటే చేర్చి బలవంతంగా కాంట్రాక్టులు రాయించుకున్నారు. పరోక్ష దేశీయ అవసరాలకు తగిన ఉత్పత్తి లేకపోవడం, విదేశీ వస్త్రాల కొనుగోలు చేయాలంటూ ఈస్ట్ఇండియా కంపెనీ ఒత్తిడులు చేశారు. అయితే ఇందుకు భిన్నంగా ఎవరైనా వ్యవహరిస్తే వారిని జైళ్లో పెట్టించారు. చేనేతన్నలు ఆత్మగౌరవ పోరాటాలు, జాతి గౌరవ పోరాటాలలో భాగంగానే హింసకు వ్యతిరేకంగా పోరాటాలు జరిపారు అనేది చరిత్ర చెపుతున్న నిజం.. ఇదంతా ఒకవైపు అయితే జె.ఎఫ్. వాట్సన్ మన దేశానికి సంబంధించి వస్త్ర ఉత్పత్తులలో ఉన్న వైవిధ్యాన్ని 1861 సంవత్సరంలో పరిశోధించి వివిధ జాతులు, సంస్కృతులపై ఆధారపడి జరిగే వేషధారణలను బట్టి తయారయ్యే 700 రకాల వస్త్ర ఉత్పత్తులను గురించి ఈస్ట్ ఇండియా కంపెనీకి నివేదించారు. ఈ నివేదిక ద్వారా మన ఉత్పత్తులకు సంబంధించిన అవగాహనను, రంగుల అద్దకం, డిజైన్స్ తయారుచేసే పద్ధతులు, దుస్తుల ఆకృతులను గమనించి దానికి అనుగుణంగా వస్త్రాలను తయారుచేశారు. ఈస్ట్ ఇండియా కంపెనీ వారు పెట్టిన ఎన్నో బాధలను నేతన్నలు ఎదుర్కొన్నారు. 1800 సంవత్సరంలో 20000 జనాభా ఉన్న ఢాకా నగరంలో 1840 నాటికి 8000లకు చేరింది. బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి నేతన్నలు ఎన్నో పోరాటలు చేశారు. దేశ గౌరవం దెబ్బ తింటుందనే అభిప్రాయంతో వారు చెప్పిన విధంగా ఉత్పత్తులను తయారు చేయలేక బంగ్లాదేశ్ ఢాకా పరిసర గ్రామం నుంచి 700 కుటుంబాలు తమ వృత్తిని విడిచి వెళ్లారంటే పరిస్థితులు ఏవిధంగా ఉన్నాయో తెలిసిపోతుంది. స్వాతంత్రోద్యమంలో ఎన్నో పోరాటాలు చేశారు. తమ కష్టానికి తగిన ఫలితం కావాలని కోరుతూ అప్పటి నుంచి ఇప్పటి వరకు పోరాటాలు చేస్తూనే ఉన్నారు. స్వాతంత్ర్యం రాక ముందు బ్రిటిష్ పాలకుల చేతుల్లో స్వాతంత్ర్యం తరువాత వడ్డీ వ్యాపారుల చేతుల్లో మోసపోతూనే ఉన్నారు.

## చేనేత..పర్యావరణ హిత

ప్రస్తుతకాలంలో పర్యావరణం ప్రమాదంలో పడటం మనకు తెలిసిందే. రసాయనిక రంగుల వాడకం పర్యావరణహితం కాదు. ఆ దుస్తులు ధరించిన వారి ఆరోగ్యానికి హాని కలిగే ప్రమాదాలుకూడా ఉన్నాయి. అయితే పర్యావరణాన్ని రక్షించేది నూలు మాత్రమేనని, అందులో కూడా చేనేత అయితే మరీ మంచిదని పర్యావరణ నిపుణులు అంటున్నారు. వడికిన నూలు ఎంతో మేలు చేస్తుంది. కానీ నూలు వడికే నేతన్నలకు మాత్రం ఆరోగ్య సమస్యలు తప్పడం లేదు.

## మార్కెటింగ్ ప్రధానం..

నేతన్నలు ఎంతో కష్టపడి నేసిన వస్త్రాలకు ప్రాచుర్యం లేక పోవడంతో నష్టాలకు గురవుతున్నారు. అయితే ప్రభుత్వం బాధ్యత తీసుకుని వాటికి బహుళ స్థాయిలో ప్రచారం చేయడం ద్వారా వారి వస్త్రాలకు మంచి డిమాండ్ రావడంతో పాటు వారి జీవనోపాధి మెరుగుపడే అవకాశం ఉంది. ఉదాహరణకు పోచంపల్లిలో దారం మీద వస్త్రాలను తయారు చేస్తారు. అలా తయారు చేయడానికి వారు ఎంతో శ్రమించాల్సి వస్తుంది. ఉదయం నుంచి రాత్రి వరకు గంటల తరబడి దారంమీదనే వస్త్రాలను నేస్తున్నారు. అలా వారు నేసిన వస్త్రాలు ఎంతో మెత్తగా ఉంటాయి. ఇలాంటి వస్త్రాలనుమార్కెటింగ్ చేయడం ద్వారా కనీసం జీవనం గడిచే అవకాశం ఉంటుంది. కానీ అలా చేయకపోవడంతో వారు తీవ్ర ఇబ్బందులు వస్తున్నాయి. ఎంతో కష్టపడి అందంగా తయారు చేసిన వస్త్రాలకు బయట మార్కెట్‌లో డిమాండ్ ఉంటే చేనేతలకు ఉండే డిమాండ్ అంతా ఇంతా కాదు. అందుకే చేనేత వస్త్రాలకు డిమాండ్ ఉన్నప్పటికీ మార్కెటింగ్ చేయక పోవడం కారణంగా వాటి ప్రత్యేకతలు తెలియడం లేదని చెప్పచ్చు. చేనేతలకు సంబంధించి ప్రభుత్వం ఎన్నో రకాల సౌకర్యాలు కల్పిస్తోంది. కానీ అవి వారికి చేరడంలో కూడా జాప్యం జరుగు తోంది. చేనేత పారిశ్రామికులు దళారీల ప్రమేయం లేకుండా తమ వస్త్రాల ఉత్పత్తులను నేరుగా వినియోగదారులకు అందించడం కోసం శాశ్వత ప్రాతిపదికన చేనేత వస్త్రాలకు మార్కెటింగ్ సదుపాయాలు కల్పించడం ద్వారా ఉపాధి అవకాశాలు మరింత మెరుగుపడే అవకాశం ఉంది. ఇప్పటి వరకు తెలంగాణాలో సిరిసిల్లా, కరీంనగర్, ఖమ్మం, మహబూబ్ నగర్ జిల్లాలలో నేత బజారు లను ఏర్పాటు చేశారు.



చేనేతలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎన్నో రకాల పథకా లను ఏర్పాటు చేశాయి. వాటిలో నగదు పరపతి ఒకటి ప్రాథమిక చేనేత సహకార సంఘం రోజూ వారికి అవసరమైన నిర్వహణవ్యయాన్ని నగదు పరపతిగా అర్హత మేరకు ఆయా జిల్లా సహకార బ్యాంకులు అందిస్తున్నా యి. అదే విధంగా పావలా వడ్డీలు. చేనేత పారి



# అమ్మ కష్టం చూసి కొడుకు కొత్త ఆవిష్కరణ..



తెలుగు రాష్ట్రాల్లో చేనేతల గురించి చెప్పుకునే సందర్భంలో చింతకింది మల్లేశం విజయగాథను చెప్పుకోవలసిందే. యాదాద్రి జిల్లాలోని ఆలేరు గ్రామానికి చెందిన మల్లేశం పేదరికం కారణంగా ఆరో తరగతిలోనే బడి మానేవాడు. తల్లి నేతపని చేసేది. తల్లి పోచంపల్లి ఇకత్ చీరె తయారీ చేసే తీరును శ్రద్ధగా గమనించాడు. గంటల తరబడి చేతులు సాచి సిల్కుపోగులను పెద్ద ఫ్రేముకు (ఆసు)కు కష్టపడి చుట్టడం చూశాడు. తల్లి భుజాలు, మోచేతుల నొప్పితో బాధపడటం చూసి అతడి లేతమనసును ఎంతో బాధపడింది. ఎలాగైనా తల్లి కష్టాన్ని తగ్గించాలని నిశ్చయించుకున్నాడు. తల్లితోపాటు పనిచేస్తూనే తమ గ్రామంలోని రైసు మిల్లులు, ఇతర వర్క్‌షాపుల్లో మెషిన్లను నిశితంగా గమనించాడు. మొదట్లో అతని ప్రయత్నాలు నిరుత్సాహపరిచాయి. ఇరుగుపొరుగు కాలం, డబ్బు వృధాచేస్తున్నావని కోప్పడ్డారు.

అయినా మల్లేశం పట్టువిడవలేదు. తన కల నిజం చేసుకోవాలనే కృత నిశ్చయంతో హైదరాబాద్ చేరుకునే ఎలక్ట్రీషియన్‌గా పనిచేయసాగాడు. ఖాళీ సమయాలను ఆసు మెషిన్ తయారీకి వెచ్చించేవాడు. ఒసారి బాలనగర్‌లోని ఓ వర్క్‌షాపుకు వెల్లాడు. అక్కడ ఓ మెషిన్ చూడటంతోనే అతడి మెదడులో మెరుపుమెరిసింది. 1999లో అతడి ఆలోచన ఫలించింది. ఆసు మెషిన్ తయారుచేసి తిరిగి తమ ఊరు వెళ్లి అక్కడ దాన్ని ప్రదర్శించి అందరి మెప్పు పొందాడు. 250 వాట్ల ఆసుమెషిన్ పొడవు 60 అంగుళాలు, వెడల్పు 40 అంగుళాలు, 50 అంగుళాల ఎత్తు ఉండి, రెండు మోటార్ల పవర్‌తో పనిచేస్తుంది. దాన్ని మెరుగుపరచటానికి తనకు తగిన చదువు లేకపోవడం, ఆ టర్మినాలజీతో పరిచయలం లేకపోవటంతో చదువుకున్న తన స్నేహితుల సహాయం పొందాడు. గతంలో ఇకత్ చీరతయారీకి ఆరున్నర గంటల సమయం పడితే మల్లేశం రూపొందించిన ఆసు మెషిన్‌తో గంటన్నర సమయం సరిపోయింది. దాంతో అదొక విప్లవమే అయింది. జిల్లాలో నేతన్నలకు అదొక వరమై ఉత్పాదకత పెరిగింది. చింతకింది మల్లేశం కృషికి గుర్తింపుగా ప్రభుత్వం పద్మశ్రీ' ప్రదానం చేసింది. అయితే ఈ అవార్డుకన్నా తన ఆసు మెషిన్ వల్ల పోచంపల్లి ఇకత్ సంప్రదాయ నేతపనివారికి గుర్తింపు రావడం తానెంతో మిన్నగా భావిస్తానంటాడు. తాను ఈ ఆసు మెషిన్ రూపొందించి 15 ఏళ్లయినా ఇప్పటికీ నల్గొండలోని ఎందరో నేత కుటుంబాల వారు ఆ యంత్రాన్ని కొనే స్థోమత లేక ఇంకా పాతపద్ధతులలోనే కష్టపడటం తనకు బాధ కలిగిస్తుందంటాడు మల్లేశం. మల్లేశం కుమార్తెలు సైతం టెక్స్‌టైల్స్ సంబంధిత కోర్సులు చదివి, తండ్రి స్ఫూర్తినందిపుచ్చుకోవటం విశేషం.

శ్రామికులకు రాయితీ ధరలలో చిలప నూలు, రంగులు, రసాయనాలు అందించడం ..రాష్ట్ర ప్రభుత్వం నూలు, రంగుల, రసాయలనాల ధరలపై పది శాతం రాయితీని 2008లో ప్రకటించడగా, 2011 నుంచి అదనంగా పది శాతం ప్రకటించింది. అదనంగా మిల్‌గేట్ పథకం కింద 10శాతం రాయితీని కల్పించారు. కేంద్ర ప్రభుత్వం ద్వారా వీవింగ్, డిజైనింగ్, రంగుల అద్దకంలో శిక్షణ, నూతన/ఆధునిక మగ్గాలను సమకూర్చడం, యార్న్ బ్యాంకుల ఏర్పాటు, డై హౌజ్, కామన్ ఫెసిలిటీ సెంటర్ల ఏర్పాటు చేస్తున్నారు. మహాత్మాగాంధీ బునకర్ బీమా యోజన ద్వారా చేనేత కార్మికులకు సామాజిక భద్రత కల్పించడం, ప్రధాన మంత్రి వీవర్స్ ముద్ర స్కీం ద్వారా రుణ సదుపాయాలు కల్పించడం చేస్తున్నారు. సమగ్ర నైపుణ్య అభివృద్ధి పథకం, చేనేత వస్త్ర ప్రదర్శనలు, చేనేత రిజర్వేషన్ చట్టం, టెక్స్‌టైల్, అప్పారల్ పార్కుల ఏర్పాటు చేస్తున్నారు.

మగ్గాల ఆధునీకరణ కోసం నూతన మగ్గాలకు సంబంధించిన పథకాలను 100శాతం గ్రాంటుగా ఆర్థిక సహాయం అందిస్తున్నారు. త్రిఫ్ట్ ఫండ్ పథకం ఎంతో ముఖ్యమైంది. కో-ఆపరేటివ్ హ్యాండ్ లూం వీవర్స్ త్రిఫ్ట్ ఫండ్ స్కీమ్ కింద ఎనిమిది శాతం వాటాగా చెల్లింపులు జరుగుతున్నాయి. ట్రెయినింగ్, మౌలిక సదుపాయాల కింద కామన్ ఫెసిలిటీ సెంటర్, కామన్ వర్క్ షెడ్, డై హౌజ్, సంఘం కింద 100శాతం గ్రాంటు ఇస్తున్నారు. ఇకపోతే 50 సంవత్సరాలు నిండిన అర్హులైన చేనేత కార్మికులకు వృద్ధాప్య పింఛన్ కింద నెలకు రూ.1000 ఇస్తున్నారు. ప్రభుత్వాల నుంచి ఎన్నో పథకాలు వస్తున్నప్పటికీ వారికి సకాలంలో అందకపోవడంతో నేతన్న జీవితాలు చీకట్లోనే మగ్గిపోతున్నాయి. ఎంతో కష్టపడి నేసిన వాటికి మార్కెటింగ్ కల్పించడం ద్వారా నేతన్నల జీవితాలు బంగారు జీవితాలుగా మారే అవకాశం ఉంది. మన చేనేత వస్త్రాలకు ప్రపంచ వ్యాప్తంగా మంచి డిమాండ్ ఉందని చెప్పవచ్చు.



బతుకమ్మ చీరెలను ఎంపిక చేస్తోన్న హేండ్‌లూమ్ డెవలప్‌మెంట్ అధికారిణి శైలజ రామయ్య

గతంలో పోలిస్తే ప్రస్తుతం తాము మార్కెటింగ్ చేసుకుంటున్నామని, దీంతో పరిస్థితి కొంత మెరుగైందని పోచంపల్లి హ్యాండ్‌లూం వీవర్స్‌కు చెందిన ప్రతినిధి భారత్ వాసుదేవ్ పేర్కొన్నారు. మరోవైపు తెలంగాణాలో చేనేత వస్త్రాలకు ప్రాధాన్యత ఇవ్వడంతో పాటు ఆ వస్త్రాలనే ప్రతి సోమవారం తప్పని సరిగా ధరించాలని చేనేత శాఖ మంత్రి కె.తారక రామా రావు ఆదేశాలు జారీ చేశారు. దీంతో కొంత మేర చేనేత వస్త్రాల అమ్మకాలు పెరిగాయి. దీంతో పాటు సిరిసిల్లాలో బతుకమ్మ చీరలు నేయించాలని ప్రభుత్వం నిర్ణయించడంతో వారికి ఎంతో ప్రోత్సాహం లభించినట్లయింది.

ఏమైనా తెలుగురాష్ట్రాలలో కుదేలవుతోన్న చేనేత కుటుంబాలకు చేయూతనివ్వాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ప్రభుత్వ ఆర్థిక సహాయం, ప్రోత్సాహకాలే కాక, ప్రజలు సైతం అన్ని విధాలుగా మేలైన చేనేతవస్త్రాలను ఆదరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ■

## జోక్స్ కార్నర్

* ఓ ఇల్లాలు ఫోన్‌లో: డాక్టర్‌గారూ! మావారు నిద్రమాత్రలనుకొని ఒళ్లునొప్పి మాత్రలు మింగేశారు. ఏంచేయమంటారు?
డాక్టర్: మరేం ఫరవాలేదు, మీ ఆయన్ను ఒళ్లు నొప్పెట్టేలా చితకబాదండి.
ఇల్లాలు: ఆ బోడి సలహా నువ్విచ్చేదేమిటి, నేనా ట్రీట్‌మెంట్ రోజూ ఇచ్చేదే కదా.

*రైలు తాబేలులా నడుస్తూ పదేపదే ఆగిపోతోంది. ఆ రైలు ఓ బంజరు ప్రదేశంలో ఆగింది. ఎంతసేపయినా కదిలే సూచనలు కనిపించలేదు. ఆ చుట్టుపక్కల ఎక్కడా చూద్దానికయినా పచ్చదనం అనేదే లేదు. ప్రయాణికులు విసుగ్గా కిటికీల్లోంచి చూస్తున్నారు. అంతలో ఓ కిటికీ పక్కగా వెళుతున్న గార్డ్‌ను ఓ ప్రయాణికుడు పిలిచాడు.
గార్డుగారూ! మీరు అనుమతిస్తే నేను రైలు దిగి పూలుకోసుకొస్తాను'
గార్డు:ఇక్కడ పూలెక్కడ ఉన్నాయయ్యా బాబూ.
ప్రయాణికుడు: ఇప్పుడు లేవనుకోండి, కానీ తప్పక పూస్తాయి. నా వద్దవిత్తనాలున్నాయిగా.

* ఇద్దరు అబ్బాయిలు మాట్లాడుకుంటూ..
ఒకడు: సూయజ్ కెనాల్ గురించి విన్నావా? దాన్ని మా నాన్నే తవ్వాడు.
రెండవవాడు: నువ్వు డెడ్ సీ గురించి విన్నావా? దాన్ని హతమార్చింది మా నాన్నే.

* అమ్మాయి నవ్వుతూ: డియర్ నువ్వు నడుస్తున్నప్పుడు నీ జోళ్లు కిర్రుకిర్రుమంటుంటాయి. కొంపదీసి దొంగిలించినవా ఏమిటి?
అబ్బాయి: అలా అయితే నా కోటు, ప్యాంటు కూడా చప్పుడు చేయాలికదా.

* ఓ చీరెల షోరూమ్‌లో యజమాని సేల్స్‌మన్‌పై మండిపడుతూ .. నీకు ఉద్యోగం చేయాలనుందా, లేదా? ఇప్పుడే మా వద్ద నీకు కావలసిన శారీ లేదని కోప్పడి ఓ లేడీ కస్టమర్‌ను పంపించేశావు. అటువంటి శారీ మన వద్ద ఉందని నీకు తెలిసినా కస్టమర్‌ని ఎందుకలా పంపించేశావు?
సేల్స్‌మన్:నేను చేసింది నా సొంత మేలుకోరే, సార్ ఆ శారీ అమ్మితే మీకు లాభం ఉండేదేమో కానీ నేను దివాలా తీసేవాడిని.
యజమాని: ఎలా?
సేల్స్‌మన్: ఆ కస్టమర్ నా భార్యే.

* మిత్రుడు: అసలు నీ కాలు ఎలా విరిగిందిరా?
పేషెంట్: అరటితొక్కమీద కాలేసి..
మిత్రుడు: జారిపడ్డావు..అంత నిర్లక్ష్యమైతే ఎలారా? చూసుకు నడవద్దూ.
పేషెంట్: పడింది నేను కాదురా మా ఆవిడ. నేను నవ్వాపుకోలేక పోయా..అంతే.
■

# నినాదాలు నిజమైన కవిత్వం కాదు...!

కవిత్వాన్ని జీవితానికి వాహికగా చేసుకొని ప్రవహించడం కొత్తకాదు. అభివ్యక్తిలో, ఆలోచనాశక్తిలో అవగాహనారీతిలో సొంత గొంతుకను వెదుక్కుని దూసుకుపోవడం కొందరికే సాధ్యమవుతుంది.

రాజకీయ లబ్ధికి, వ్యక్తిగత ప్రచారానికీ తోడ్పడేది కవిత్వంకాదు. ఆ ధోరణి సమాజ శ్రేయోదాయకం కాదు. నినాదాలు చేయడం, నీతులు చెప్పడం కవిత్వ లక్షణం కాదు. కేవలం వినోదం కోసం కాకుండా, విజ్ఞాన, వికాసాత్మకంగా విశేష ప్రయోజనాత్మకంగా ఉండాలి.

ఒకప్పుడు కవిత్వ భాష అందరికీ అర్థంకాని గ్రాంథికమై, ఎంతోమందికి అందలేదు. దాన్ని అందరికీ అందేటట్టు చేయడానికి పెద్ద ఎత్తున వ్యావహారిక భాషోద్యమాన్ని లేవదీయవలసి వచ్చింది. అలాగే ప్రయోజనాల కోసం, కొత్తకొత్త ప్రయోగాలు చేస్తుంటే, కవిత్వం అందరికీ అందుబాటులో లేక మరోరకమైన, సరికొత్త ఉద్యమాన్ని ఇప్పుడు లేవదీయాల్సి వస్తుందేమో..!

మనస్సులో వెల్లువెత్తే భావోద్వేగాలకు ఊపిరిపోయడం, అక్షరరూపమివ్వడం అంత తేలిక కాదు. శైలిలో వర్ధమానతరంతో పోటీపడుతూ సాగిపోతున్నట్లు కవిత్వం కనిపించాలి, వినిపించాలి, అనిపించాలి. అప్పుడు ఆ కవిత్వంలో ప్రతిభ ఉంటుంది. దార్శనికత ఉంటుంది. నిబద్ధత నిజంగా ఉంటుంది.

పాఠకుల హృదయాలకు, హత్తుకునేలా కవిత్వం రాయడం ఒక కళ. పాఠక హృదయాలనే కాకుండా సంపాదకుల, పురస్కార నిర్ణేతల మెప్పు పొందగలగడం ఇంకా గొప్ప కళ. సుకవికి– పదం మీద పట్టు, భాషలో సుషమ, అభివ్యక్తిలో శక్తి ఉంటుంది. ప్రతి కవిత అనుభూతి వాదానికి హారతిపడుతూ, అభివ్యక్తి నిపుణతకు అద్దంపడుతుంది. సౌహార్ద్ర పూర్వక ఆర్ద్ర సందేశం ఉదార భావ ప్రవాహంలా పాఠకుల ఎదలోతుల్లోకి ప్రవేశిస్తుంది.

సందర్భాన్ని గొప్పగా కవిత్వం చేయడం అందరికీ చేతకాదు. లోచూపుతో దృశ్యాన్ని ఒడిసిపట్టుకొని, అపురూప క్షణాల మధ్య పరిస్తే– ఆ అనుభూతి ఆస్వాదనే వేరు. చిరకాలం ఇంకిపోని దృశ్యంలా మనసుపొరల్లో గాఢంగా నాటుకుపోతుంది.

కవి పుట్టిపెరిగిన వాతావరణం కొనసాగుతున్న వివక్ష, జీవన విధ్వంసం, నిర్బంధాలను నిరసిస్తూ, అనేక అస్తిత్వ ఉద్యమాల నేపథ్యంలో కవి తన జీవన మూలాల్లోకి అప్రయత్నంగానో, అత్యవసరంగానో తొంగి చూస్తాడు. కడుపుకాలితే కవిత్వం వస్తుంది. గుండె రగిలితే గొంతులో ధైర్యం పుడుతుంది. ఆ ఆవేశాగ్ని మంటలో పుటమెట్టిన అక్షరాలే జనకవనంగా రూపుదిద్దుకుంటాయి. సారవంతమైన భావపటిమకు బాటలు వేస్తాయి. ఇలాంటి పొగలసెగలు రగిలితేనే కవి కవిత్వం కణకణ మండుతుంది.

సమాజంలో వ్యవసాయ, శ్రామిక వర్గ కుటుంబం నుండి వచ్చిన కవి– ప్రకృతి, ప్రపంచం, మనిషి, ఈ మూడింటి తత్త్వాలు బాగా తెలిసి వుంటాడు. మట్టితో అనుబంధం ఉన్నవాడైతే– పట్టణాలలో జీవిస్తున్నా, పల్లె పరిమళాలను మరిచిపోడు. పల్లెల్లోని దుర్మార్గాలు, అన్యాయాలు, అక్రమాలు ఆ కవికి తెలుసు. అదే సమయంలో రైతు, వృత్తికారులు, కూలీలు, వారి అనుబంధాలు కూడా కవికి కరతలామలకం. వ్యవసాయం మీద ప్రకృతి అననుకూలతలను, ప్రభుత్వ విధానాలు చూపుతున్న నిర్లక్ష్యాన్ని ఆ కవి బాగా పసిగట్టి కవిత్వీకరించగలడు.

కవిత్వం రాస్తే రసం చిప్పిల్లినట్టుండాలి. కవులు చాలామందికి ఈ విషయం పట్టినట్టులేదు. వీరి కవిత్వంలో రసం కన్నా నీరసమే ఎక్కువగా ఉంటుంది. వస్తువును శిల్పశోభితం చేయాలని ఆలోచన ఏమాత్రము ఉండదు. కవితా నిర్మాణ పద్ధతులు, పదచిత్రాలు, ప్రతీకలు ఎన్ని ఉన్నాయని సర్జరీచేసి చూస్తే మేడిపండులాగా పైకి బాగా కనిపించిన కవిత్వం కాస్తా పొట్టవిప్పి చూస్తే, పురుగులుండునన్న సామెతలా అర్థంకాని సంక్లిష్టపదాలు, అసందర్భపు వ్యాఖ్యానాలు, అస్పష్ట భావాలు, పద బంధాల జిమ్మికులు, వాక్యాలను అటు ఇటూ మార్చి చెపితే పునరుక్తి దోషాలుంటాయి.

సాహితీవనం



మంచి కవిత్వంలో అనేక పార్శ్వాలు దొర్లుతూ ప్రత్యక్షమవుతాయి. వీటి లోతుపాతులను తవ్వుకుంటూ పోతే కాలంచేసే గాయాలు అనేకం మనసుని మెలిపెడతాయి. ఇలాంటి వూహల తుళ్లింతల్లోంచి మెరికల్లాంటి కొసమెరుపులు అక్కడక్కడా కవితా వాక్యాల రూపంలో తళుక్కుమంటాయి.

కవిత్వం అంటే ఒక సామాజిక చర్య. ఒక సాంస్కృతిక ప్రక్రియ. ఒక చైతన్య స్వరం. నిర్దిష్ట స్థల, కాల సమాజ ప్రజాజీవనానికి అక్షరరూపం. సాధారణంగా ప్రతి మంచి కవి ఏంచేస్తాడంటే తన ప్రతి రచనలోనూ తన స్థల కాలాల ఆనవాలును వదిలితీరతాడు. అతడు గతంలోకి వెళొచ్చు. భవిష్యత్తులోకి కూడా వెళ్లొచ్చు. కానీ ఏ వర్తమానంలో నిలుచుని ఉన్నాడో చెప్పే తీరతాడు.

కొత్తగా రాసేకవి కవిత్వంలో పూర్వ కవుల ఛాయలు కనిపించక మానవు. ఏదో చెప్పాలనే ప్రయత్నంలోంచి, ఎలా చెప్పాలనే రెండో అడుగుపడుతుంది. ఎలా చెప్పాలో తెలిసినా కొద్దికొద్దిగా కవిత్వంలో గాఢత, సాంద్రత కేంద్రీకృతమవుతుంది. క్రమశః ప్రస్తుత సమాజంలో అట్టడుగు జీవుల అవస్థలను, ఆర్ద్రతను అర్థంచేసుకునేందుకు ప్రయత్నం జరుగుతుంది.

కేవలం వర్తమాన విషయాలనే వస్తువుగా తీసుకుని రచనలు చేసేవారే ఘరానా కవులుగా చలామణీ అవుతున్నారు. కవి అన్నవాడు ఏవిధమైన తాపత్రయానికీ అధికంగా లోనుకాకూడదు. తన రచనా శైలి, విధానం పసిగట్టగలిగిన కొద్దిమంది పాఠకులయినా చాలు. కవికి నిశిత పరిశీలన, నిర్ద్వంద్వ ప్రకటన, మట్టిపట్ల, మనిషి మనుగడ పట్ల సానుభూతి, సామాజిక వికృత పోకడలపై నిర్దుష్ట నిరసన ఉండాలి.

–ఎస్.ఆర్.భల్లం



# క్రృతి

## అబ్బురపరిచే కథలు



అంతరంగంలోని ఆలోచనల సంరంభానికి,సౌందర్య భరితమైన రాగమాధుర్యాన్ని రంగరిస్తూ వివరించే కథలు బహుకొద్ది. అలా రాయగలగాలంటే కథల కర్మాగారంలో పనిచేసే కార్మికుడు కాదు కావలసింది, భావుకతలో తన కలాన్ని ముంచి, మానవ సంబంధాల్ని అపారమైన ప్రేమతో చిత్రీకరించేవారు కావాలి. తక్కువగా కథలు రాయటం, అలా రాసిన కథలకు పై లక్షణాలను అద్దటం రచయిత బుర్రా లక్ష్మీనారాయణకే చెల్లింది. కవితాత్మకమైన వచనం, కథ కంటే ఎక్కువగా కథనశైలికి ప్రాధాన్యతనివ్వటం వీరి కథల్లోని ప్రత్యేకత. కథకు ఎన్నుకున్న శీర్షికల్లోనే రచయిత ప్రత్యేకత ద్యోతకమవుతుంది. కలచాలనం, అను..రాగలయ, రాగలీల, 'పేరులోనే'ముంది, ఊహాపోహ-లు, మచ్చుకు కొన్ని. ఇక తన కల(o) చాలనంతో ఎంతటి అద్భుత ప్రపంచాన్ని సృష్టించాడో కథల్లోకి వెళ్తేనే తెలుస్తుంది. 'అనాదనాది అంపశయ్య', 'మొవ్వన పూచిన మొన్నటితనం', 'పెనుగులాడుతున్నకొద్దీ కర్కశమమే, గొలుసు కొక్కాలు, ఆశల ప్రవాహం మీద అనంతంగా పరుచుకున్న.. లాంటి పదాలతో పాఠకుల్ని ఆలోచనలకు, పురిగొల్పుతారు. సబిత, నీలగోరింట, సువర్చల, ప్రియంవద, చందు, లీల లాంటి పాత్రలు నందివర్ధనాలంత ముద్దుగా, ఉదాత్తంగా కనిపిస్తాయి. పాఠకుడిని అబ్బురపరిచే కథలివి.

**(కలచాలనమ్: బుర్రా లక్ష్మీనారాయణ; వెల: రూ.100; ప్రతులకు: బుర్రా లక్ష్మీనారాయణ, 2-2-647-235-18- ఎ, జామ్‌జామ్ మసీద్ ఎదురుగా, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్-500013)**

-కూర చిదంబరం

## విలువైన విలక్షణ కథలు..



'ఇది కథ కాదు' అని తొలికథ మకుటం. కానీ 'మన్నెం శారద కథలు'లోని ఏ కథ చదివినా ఇది కథ కాదు, వాస్తవ జీవితమే అనిపిస్తుంది. ఆ పాత్రలు, మన స్వత్వాలు, సందర్భాలు అంత సహజంగా ఉన్నాయి. కథల్లో కొన్ని పాత్రలైతే అసూయాద్వేషాలకు అతీతంగా ఎంతో ఔదార్యంతో నడుచుకుంటాయి. 'ఇది కథ కాదు'లో నర్మద పాత్ర అలాంటిదే. మనసారా ప్రేమించిన చంద్రశేఖర్ చివరకు తన మనసును గాయపరిచినా, అతడు అప్పగించిన పాప బాధ్యతను నెరవేరుస్తుంది. 'ప్రేమా! నీపేరే అమ్మ'లో అమ్మకు గొప్ప నిర్వచనాన్ని చ్చారు. 'ఇప్పటికిదే ముగింపు' కథలో సింధు పాత్రను మలిచిన తీరు ప్రశంసనీయంగా ఉంది. తండ్రి.. అన్న..భర్తల దౌష్ట్యాన్ని చూసిన ఆమె తనకు మగబిడ్డే వద్దనుకుంటుంది. 'సామాజిక గౌరవం కోసం మనసుని, జీవితాన్ని కాల్చుకుని బతికే ఆడపిల్లని కాను నేను, నా జీవితం నాక్కావాలి..' అంటూ ప్రగతికి ప్రతీకగా నిలుస్తుంది. 'మనిషికోస్నేహం' కథలో ఎలిజబెత్ పాత్ర, మాధవ్ ఎంతో ఔదార్యంతో నాటకాన్ని కొనసాగించడం ఎంతైనా బాగుంది. 'కిటికీ' కథలో నీలు జీవితం పాఠకుడి మనసు చెమరింపజేస్తుంది. కిటికీ ఇచ్చే కాస్త ఉపశమనం కూడా సహించలేని అత్తవారు ఆ కిటికీని మూసేయటం, నీలు ఆత్మహత్య.. విజయలో ఆత్మ సమీక్ష, మనసు కిటికీ తెరుచుకోవటం.. కథ ఎంతో గొప్పగాఉంది. ఇవి కేవలం మచ్చుతునకలే. ఈ సంపుటిలోని అన్ని కథలూ అమూల్యాలే.. అపురూపాలే! చదివితీరాల్సిన కథలివి.

**(మన్నెం శారద కథలు: మన్నెం శారద; వెల:రూ.200; ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక విక్రయ కేంద్రాలు)**

-జె.శ్యామల

## కదిలించే కవిత్వం..



ఉద్యమ స్ఫూర్తి, ప్రభుత్వ దమనకాండపై నిరసన గళం, సామాజిక ప్రయోజనాన్ని ఆశించే కవిత్వం.. వెరసి డా.దామెర రాములు సాక్షాత్కరిస్తాడు. తోటి మనిషిని ప్రేమించడం, ఆర్థిక అసమానతలను చీల్చి చెండాడడం, కులవివక్షను వ్యతిరేకించడం, ప్రకృతి సోయగాలలో పరవశించడం ఈ కవి తత్త్వం. ఈ 'భిన్నకాలం'లోని 65 కవితల్లో కవితత్త్వం బోధపడుతుంది. ఆయన వ్యక్తిత్వం సంపూర్ణంగా ఆవిష్కృతమవుతుంది.అకాల వర్షాల ఆటలో పావుగా మారిన రైతుల దైన్యస్థితిని భిన్నకాల పరిణామంగా వర్ణిస్తాడు కవి. పక్కా ప్రణాళికలతో, పథకాలతో, దృఢచిత్తంతో ఎదుర్కోవాలని హితవు పలుకుతాడు. 'ప్రజా రుగ్మతలకే కాదు.. సాహితీలోకంలోని నాన్చివేత-దాటవేత' జాడ్యానికి కూడా ఔషధాన్ని సూచిస్తాడు. 'ఏ కవినైనా నిలదీసే హక్కు ప్రజలకుంది. తస్మాత్ జాగ్రత్త' అని హెచ్చరిస్తాడు. దోపిడికి గురవుతున్న బడుగు జనం, రైతన్న వెతలు, ఆత్మహత్యలను ప్రేరేపిస్తున్న నిరాశా నిస్పృహలు, సమాజాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలు ఆయన కవితా వస్తు వులు. శిల్పంకోసం వస్తువుని పణంగా పెట్టకుండా భిన్నకాలంలో కవి ఆలపిస్తున్న కవితాగానం పాఠకుల్ని కదిలిస్తుంది...ఆలోచనలు రేకెత్తిస్తుంది. ఆలోచింపజేయడమే నిజమైన కవిత్వ లక్షణం. అప్పుడే సార్థకత.

**(భిన్నకాలం-డాక్టర్ దామెర రాములు; వెల:రూ.100; ప్రతులకు: దామెర శోభారాణి, కేరాఫ్ నిర్మల్ నర్సింగ్ హోమ్,తిరుమల థియేటర్ ఎదురుగా, వివేక్ నగర్,నిర్మల్-504106, తెలంగాణ)**

-రమణ వెలమకన్ని

## శక్తిమంతమైన కవిత్వం..



దాదాపు దశాబ్ద కాలంగా వివిధ పత్రికల్లో ప్రచురణ అయిన జిందం అశోక్ కవితల (మినీ) సంపుటి గవ్వలు. తల్లిని గురించి ప్రతి కవి కవిత రాస్తాడు. అశోక్ కూడా తల్లిని అద్భుతంగా కవిత్వీకరించాడు. 'బ్రహ్మకన్నా అమ్మ గొప్పది' అంటారు. నవమాసాలు మోసి/ నొప్పులు పడి బిడ్డకు జన్మనిచ్చింది'. కేవలం 3 లైన్లలో శక్తివంతమైన కవితను రాయడం ఈ గవ్వలు ప్రక్రియకే సాధ్యమేమో. 'ఒట్టచేపలకు/ సబ్సిడీల గాలం/ రైతన్న శ్రమంతా రూపాయికి కిలో...' అంటారు కవి. అలాగే గ్రామాల్లోని నీటి-కన్నీటి బాధల్ని .. అద్భుత కవితలో వాస్తవాన్ని అక్షరీకరిస్తూ.. 'మా ఊరిలో/ ఇంజినీరు డాక్టరు లాయరు మంత్రి ఉన్నారు/ గుక్కెడు నీళ్లిచ్చేటోడే గతి లేదు' సరళీకరణ ఆర్థిక విధానాలతో గ్రామాలు, తండాలు, అడవి, ఏజెన్సీ ప్రాంతాలు ధ్వంసం అవుతున్నాయి. ఇదే అంశాన్ని 3 పాదాల్లో కవిత్వీకరిస్తూ.. 'అక్కడ!/ ఒక తండా ఉండాలే.. ఏమైంది?/ పారిశ్రామిక వాడలో మాయం! ...అన్ని పోరాటాల్లో- యుద్ధాల్లో- రాజకీయాలకు బలి అయ్యేది పేదలు- సామాన్యులే! చరిత్ర చెప్పిన ఈ సత్యాన్ని గవ్వల ప్రక్రియలో ఇలా రాశారు...'ఏ యుద్ధం జరిగినా/ మరణంలో/ సామాన్యుడిదే.. ముందడుగు' అంటారు. బర్రె పాలియ్యదు/ కోడి గుడ్డు పెట్టదు/ రేడియేషన్ దెబ్బకు మానవ మనుగడే ప్రశ్నార్థకం' అంటారు.

**(గవ్వలు: జిందం అశోక్; వెల:రూ.60; ప్రతులకు:అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు)**

-తంగిరాల చక్రవర్తి




# అచంచల ప్రేమ

కస్తూరి మురళీకృష్ణ

**'నేను తాగను' తల అడ్డంగా తిప్పుతూ అంది బాయ్ సుజెన్.**

**'తాగాల్సిందే' గుర్వాజ్ఞ ఇది' స్థిరంగా అన్నాడు క్సుక్సాన్.**

**'ఎలా చెప్పాలి ఇతడికి?' మనసులో ఆందోళన చెందుతోంది బాయ్ సుజెన్.**

**అతడికి నిజం తెలియదు. తాను ఈ ద్రవం తాగిన మరుక్షణం క్సుక్సాన్‌కి నిజం తెలుస్తుంది.**

**నిజాన్ని అతడు భరించగలడా?**

**నిజం తెలిసిన తరువాత కూడా తనని అతడు ఇంతకుముందులా ప్రేమించగలడా?**

ఆమె మనస్సులో పలు ఆలోచనలు సుళ్ల తిరుగుతున్నాయి. ఆందోళన అర్ణవంలా అల్లకల్లోలమవుతోంది.

'ఇదంతా ఫాహాయ్ కుట్ర అయి ఉంటుంది' అనుకుంది.

ఫాహాయ్' గుర్తుకు రాగానే ఆమెలో కోపం ఉవ్వెత్తున ఎగసింది.

ప్రేమ, ద్వేషం ఒకే నాణేనికి రెండువైపులంటారు. తనపై 'ఫాహాయ్'కి అనంతమైన ద్వేషం అని బాయ్ సుజెన్‌కి తెలుసు. అతడు తనని క్సుక్సాన్ నుండి వేరుచేయాలని ప్రయత్నిస్తున్నాడనీ తెలుసు. కానీ క్సుక్సాన్‌కి అతడి గురువు ఫాహై ఉన్న నమ్మకాన్ని ఆమె మార్చలేదనీ తెలుసు. క్సుక్సాన్‌కి తనపై ఉన్న నమ్మకాన్ని ఆధారం చేసికుని ఫాహాయ్ తనని బాధిస్తున్నాడనీ, తనని క్సుక్సాన్ నుండి వేరుచేయాలని ప్రయత్నిస్తున్నాడనీ బాయ్ సుజెన్ గ్రహించింది. ఎలాగయినా ఫాహాయ్ అసలు రూపాన్ని క్సుక్సాన్ గ్రహించేట్టు చేయాలనుకుంది. కానీ, అందుకు ప్రయత్నాలు ఆరంభించేలోగా ఫాహాయ్ ఈ బెడద తెచ్చిపెట్టాడు.

'ద్వాన్వు పండుగ రోజు ఇది తాగాలని ఫాహాయ్ చెప్పారు. తాగి తీరాల్సిందే. నాపై నీకు ఏమాత్రం ప్రేమ ఉన్నా నువ్వు తాగాల్సిందే' నిశ్చయంగా అన్నాడు.

'ప్రేమ' విషాదంగా నవ్వుకుందామె.

'నేను ఇది తాగితే నీమీద నాకు ప్రేమ ఉన్నట్టు. కానీ తాగిన తరువాత తెలుస్తుంది నీకు నామీద ఎంత ప్రేమ ఉందో' అనుకుంది.

'తాగితేనే ప్రేమ ఉన్నట్టా? ఇది తాగకపోతే ఇన్నాళ్ల మన అనుబంధం శూన్యమా? ఒక నాటకమా?' పైకి అడిగింది.

క్సుక్సాన్ మాట్లాడలేదు. ద్రవం పాత్రవైపు చూస్తూ కూచున్నాడు.

ఆమె నవ్వింది. పాత్రను చేతిలోకి తీసుకుంది.

'నీకు ఇష్టం లేకపోతే తాగకు. క్షమించు. నేను తప్పు మాట్లాడాను. నువ్వు తాగినా, తాగకున్నా నామీద నీకు అచంచలమైన ప్రేమ ఉందని నాకు తెలుసు. మనం ఒకరినొకరు చూసుకున్న క్షణం నుంచీ మన నడుమ విడదీయరాని బంధం ఏర్పడింది. దానికీ, దీనికీ సంబంధం లేదు' అన్నాడు ఆమె చేతిలోంచి ద్రవం ఉన్న పాత్రను లాక్కుంటూ.

అయితే ఆమె దాన్ని విడవలేదు.

'నేను తాగుతాను. నీమీద నాకెంత ప్రేమ ఉందో నిరూపించుకునేందుకు కాదు. నామీద నీకెంత ప్రేమ ఉందో తెలుసుకునేందుకు' అంది.

ఆమె ఏమంటున్నదో అతడికి అర్థంకాలేదు.

అంతలో ఆమె పాత్రను ఎత్తి గటగటా ద్రవాన్ని తాగింది.

అతడు ఆమె వైపే చూస్తూ నిలబడ్డాడు.

ద్రవం తాగి ఖాళీ పాత్రను పక్కనపెట్టింది. అతడి వైపు చూసి నవ్వింది.

'మీ గురువు ఫాహాయ్ నిన్నూ, నన్నూ విడదీయాలని చూస్తున్నాడు. అతడికి నీపై ప్రేమ లేదు. నాపై ద్వేషం. నన్ను సర్వనాశనం చేయాలని ప్రయత్నిస్తున్నాడు. ఇప్పటినుంచి కాదు..నువ్వు నాకు తెలియక ముందు నుంచీ అనంతకాలం నుంచీ అమరత్వం సాధించాలన్న తపన మా ఇద్దరినీ ప్రత్యర్థులను చేసినప్పటినుంచీ, మా అన్వేషణలో నీవల్ల నేను విజయం సాధించినప్పటినుంచీ అతడు నన్ను ద్వేషిస్తున్నాడు'.

ఆమె ఏమంటోందో అతడికి అర్థంకాలేదు. కానీ ద్రవం తాగినప్పటినుంచీ ఆమెలో ఏదో మార్పు వస్తున్నట్టు అతడికి అర్థమయింది.

అంతలోనే అతని కళ్లు పెద్దవయ్యాయి.

ఆమె...ఆమె.. మారుతోంది...

ఆమె..ఆమె కాదు...

ఆమె కళ్లు లోపలకు పోతున్నాయి. శరీరం సాగుతోంది. కాళ్లు.అతుక్కుపోయి, ఒకదానిలో ఒకటి కలిసిపోయి, రెండూ ఒకటే అయి సాగుతున్నాయి.

ఏం జరుగుతోందో అతడికి అర్థంకావటంలేదు.

'బాయ్ సుజెన్' అరుస్తున్నానని అనుకున్నాడతడు. పెదిమలు కదలుతున్నాయి. కానీ శబ్దం బయటకు రావటంలేదు.

ఆమె విచిత్రంగా నవ్వుతోంది. అంతలో ముఖం సాగిపోయింది. ఆమె నాలిక చీలిపోతోంది. ఆమె రంగు మారిపోతోంది.

'కెవ్వు'మని అరిచాడతడు.

ఆమె...ఆమె కాదు..ఆమె ఇన్నాళ్లూ తాను ప్రేమించిన వ్యక్తి మనిషి కాదు..సర్పం! శ్వేత సర్పం!

పెద్దగా అరచి పడిపోయాడతడు.

**********

'బాయ్ సుజెన్' చెప్పింది విని క్వియావో పింగ్.

ఆమె ముఖం గంభీరంగా ఉంది. కాస్సేపు ఆలోచించి అంది.

'నువ్వు బానిసగా ఉన్నా నాకు స్వేచ్ఛ నిచ్చావు. నేను నీకు సహాయం చేస్తాను. మనిద్దరం ఏమై కొండ వెళ్లాలి. అక్కడ ఒక మూలిక ఉంది. దాని వల్ల క్సుక్సాన్‌ను చైతన్యవంతుడిని చేయవచ్చు. లేకపోతే అతడు జీవితాంతం అలా చైతన్యరహితుడిగానే ఉంటాడు'.

'అలా కాకూడదు. ఎన్ని కష్టాలయినా సహిస్తాను. అతడిని

చైతన్యవంతుడిని చేస్తాను. అతనలా నిర్జీవుడిలా పడి ఉంటే నేను భరించలేను'.

బాయ్ సుజెన్ వైపు జాలిగా చకూసింది క్సియావో పింగ్.

'నువ్వింత కష్టపడి అతడిని చైతన్యవంతుడిని చేస్తావు. కానీ స్పృహవచ్చిన తరువాత అతడు నిన్ను ఇష్టపడకపోతే? ఇప్పుడు నువ్వు మనిషివి కావు, మనిషి రూపంలో ఉన్న సర్పానివి అని అతడికి తెలిసిపోయింది. నిన్ను ఇష్టపడకపోతే? దగ్గరకు రానీయకపోతే?' ప్రశ్నించింది క్సియావో పింగ్.

విషాదంగా నవ్వింది బాయ్ సుజెన్.

'ప్రేమలో మోసం ఉండకూడదు. అతడిని నేనెంతగా ప్రేమించానంటే అతడి ప్రేమ పొందటంకోసం నేను సర్పాన్నన్న నిజాన్ని దాచాను. మానవరూపం ధరించి అతడి ప్రేమ పొందాను'. ఇంతలో ఆమె ముఖంలో రంగులు మారాయి.

అది గమనించిన క్సియావో పింగ్ ఆందోళనగా అడిగింది 'ఏమైంది?'

నిస్త్రాణగా కూలబడింది బాయ్ సుజెన్. 'నేను గర్భవతిని!' అంది.

ఆమె వైపు జాలిగా చూసింది క్సియావో పింగ్.

'ఇప్పుడెలా?' అడిగింది.

'ఫరవాలేదు..నాశక్తి తగ్గిపోయేలోగా మూలికను తెద్దాం. ఆ తరువాత దైవ నిర్ణయం ఎలా ఉంటే, అలా జరుగుతుంది' అంది.



***********

కళ్లు తెరిచాడు క్సుక్సాన్!

అతడికి ఎదురుగా బాయ్ సుజెన్ కనిపించింది.

'సుజెన్' ఆనందంగా ఆమెకోసం చేతులు సాచాడు క్సుక్సాన్.

అనుమానంగా చూసింది ఆమె అతడి వైపు...

'మీరు పూర్తిగా చైతన్యవంతులయ్యారా? నా అసలు రూపం గుర్తుందా?' అడిగింది.

'సుజెన్..నాకు నువ్వు కావాలి. నీరూపం కాదు. మనల్ని ఏశక్తీ విడదీయలేదు. నేను నిన్ను సంపూర్ణంగా ప్రేమిస్తున్నాను' అన్నాడు క్సుక్సాన్.

అతడి కౌగిలిలో ఒదిగిపోయింది బాయ్ సుజెన్. కాస్సేపటికి అంది.

'కానీ..ఫాహాయే..మనల్ని ఒంటరిగా వదులుతాడా? మనల్ని వేరుచేయందే అతడికి శాంతి లభించదు' అంది.

'నీకు ఫాహాయ్‌కి నడుమ ఏ విషయంలో స్పర్థ జనించింది?' అడిగాడు.

నిట్టూర్చి చెప్పిందామె.

'నేను సర్పాన్ని ఎలాగో, అలాగే ఫాహాయ్ తాబేలు. ఇద్దరం అమరులమయ్యేందుకు డావో పద్ధతులను అవలంబించాం. ఇంతలో నీవల్ల నాకు అమరత్వానికి దారి లభించింది. ఇది ఫాహాయ్ భరించలేకపోతున్నాడు. అందుకని, జపం వల్ల లభించిన శక్తుల వల్ల అతడు బుద్ధ శ్రమణుడి వేషం ధరించాడు. నిన్ను లోబరచుకుని, నీద్వారా నన్ను సాధించాలని చూస్తున్నాడు'.

ఆమె మాటలు వింటూ ఆలోచిస్తూ యథాలాపంగా తలుపువైపు చూసిన క్సుక్సాన్ భయంతో అరిచాడు.

తలుపు దగ్గర ఫాహాయ్ ఉన్నాడు.

కన్నుమూసి తెరిచేలోగా తన మాయాజాలంతో క్సుక్సాన్‌ను తీసుకుని మాయమయ్యాడు.

అతడిని అడ్డుకోబోయింది బాయ్ సుజెన్. కానీ కడుపులో బిడ్డ కదలటంతో కదలలేక కూలబడిపోయింది కన్నీళ్లు కారుస్తూ.

***********

కన్నీరు కారుస్తున్న సుజెన్ అలికిడి అవటంతో తల ఎత్తి చూసింది. ఆశ్చర్యంతో ఆమె కళ్లుపెద్దవయ్యాయి. తాను చూస్తున్నది కలా? నిజమా? అర్థం కాలేదామెకు.

ఎదురుగా క్సుక్సాన్ నిలబడి ఉన్నాడు.

'నేను చెర నుంచి తప్పించుకుని వచ్చాను. పద వాడికి దొరక్కుండా పారిపోదాం' అన్నాడు క్సుక్సాన్.

ఆమె ఏదో అనబోయింది. నొప్పితో ఆమె వొళ్లంతా అదిరిపోయింది.

అతి కష్టం మీద చెప్పింది 'నిన్ను వాడి చెరనుంచి తప్పించటానికి నేను విశ్వ ప్రయత్నాలు చేశాను. కానీ నా శక్తి సరిపోలేదు'

మాట పూర్తికాకముందే శిశు ప్రసవాన్ని సూచిస్తూ నొప్పులు ఆరంభమయ్యాయి.

***********

'మన పిల్లవాడి పేరు క్సు మెంజియావో' గర్వంగా చెప్పాడు క్సుక్సాన్.

సంతోషంతో పిల్లవాడిని అందుకోవటానికి చేతులు సాచింది బాయ్ సుజెన్.

అంతలో ఎటునుంచి వీచిందో నల్లటి సుడిగాలి వీచింది. గాలి దుమారం తగ్గేసరికి బాయ్ సుజెన్ కనబడలేదు.

'ఫాహాయ్ సుజెన్‌ను ఎత్తుకుపోయాడు' అన్నారెవరో.

కుప్పకూలిపోయాడు క్సుక్సాన్.

***********

పద్దెనిమిదేళ్లు గడచిపోయాయి. క్సుమెంజియావో గొప్ప కన్ఫూషియస్ తత్వవేత్త అవటమే కాదు, ఆత్మరక్షణ యుద్ధవిద్యలో నిష్ణాతుడయ్యాడు.

ఒకరోజు అతడు తండ్రికి నమస్కారం చేసిచెప్పాడు.

'నాన్నా..నేను అమ్మని బుద్ధభిక్షువు ఫాహాయ్ చెరనుంచి విడిపించి తెస్తాను'

'నువ్వు చిన్నపిల్లవాడివి. వాడు మాయమంత్రాలలో నిష్ణాతుడు'.

'నేను యువకుడిని. వాడు ముసలివాడు' అన్నాడు క్సు మెంజియావో స్థిరంగా.

***********

క్సుమెంజియావోను అతని తల్లిదండ్రులు సంతోషంగా దీవించారు.

ఫాహాయ్‌ను ఓడించి తల్లిని చెరనుంచి విడిపించి, ఇద్దరినీ కలిపాడు అతడు.

క్సుమెంజియావో నుంచి తప్పించుకునేందుకు ఫాహాయ్ 'పీత' శరీరంలోకి దూరాడు. అందుకే పీత శరీరం కొవ్వు కాషాయ వర్ణంలో ఉంటుందని చైనీయులు నమ్ముతారు. ఎందుకంటే బౌద్ధ భిక్షువయిన ఫాహెయ్ కాషాయ వస్త్రాలు ధరిస్తాడు కాబట్టి.

***********

చైనీయుల పురాణాలలో అత్యంత ప్రఖ్యాతి పొందిన ఈ 'శ్వేత నాగు' ప్రేమ కథ ఈనాటికీ చలామణిలో ఉంది. ఎన్నో సినిమాలు, ఒపేరాలు, టెలివిజన్ సీరియల్లు, నాటకాలు, రచనలు ఈ గాథ ఆధారంగా రూపొందాయి. పలువురు ఈ కథను చైనా దేశంలో డావోయిజం, బౌద్ధం, కన్ఫూషియనిజం వంటి తత్వాల నడుమ జరిగిన పోరుకు ప్రతీతాత్మకంగా ప్రదర్శించే గాథగా భావిస్తారు. ■

# వివిధ విద్యలు

కథ

పడవలోకి ఎక్కాడు ఓ పండితుడు. పడవవాడు హుషారుగా ఓ కూనిరాగం తీస్తూ తెడ్డువేస్తూ పడవను ముందుకు నడిపిస్తున్నాడు. పండితుడు తోటి ప్రయాణికులతో ఈమాట, ఆమాట మాట్లాడుతూ, సాధ్యమైనన్ని విద్యలు, ఎన్నో మెలకువలు నేర్చుకోవాలని చెప్పసాగాడు.

అంతలో పడవ సరంగు 'అయ్యా! నేను ఏ విద్యలూ నేర్చుకోలేదు, నాకొచ్చింది కేవలం ఈ పడవ నడపడం' చెప్పాడు.

'ఫరవాలేదు, ఇప్పటికైనా మించిపోయింది లేదు, పడవ చేయడం నేర్చుకో, చేపలు పట్టడానికి వల అల్లడం నేర్చుకో, నీ పడవకు దారిగా, నీ ఆకలి తీరుస్తున్న ఈ నదిని గురించి తెలుసుకో' చెప్పాడు పండితుడు.

పడమ నదిమధ్యలోకి వెళ్లింది. ఇంతలో మేఘాలు కమ్ముకొచ్చి వానపడసాగింది. క్రమంగా వర్షం పెద్దదైంది. పడవలో నీళ్లు నిండసాగాయి. పడవవాడు వేగంగా తెడ్డు వేస్తూ పడవను నది ఒడ్డువైపుకు నడిపించసాగాడు. అయినా పడవనిండా నీళ్లు చేరటంతో పడవ మునిగే ప్రమాదం ముంచుకొచ్చింది. ఈత వచ్చిన వారు నదిలో దూకి ఒడ్డుకు ఈదసాగారు.

'అయ్యా, మీరు ఎన్నో శాస్త్రాలు నేర్చుకున్నారు. కానీ ఈతకూడా నేర్చుకోండి. వరదల్లో ఈత ప్రాణాలను నిలబెడుతుంది' అంటూ పండితుడిని ఉద్దేశించి గట్టిగా అరిచి పడవ సరంగు నదిలోకిదూకి ఒడ్డుకు ఈదుకుంటూ వెళ్లాడు. కొంతదూరం వెళ్లాక తన పడవ ఏమైపోయిందోనని, పండితుడు బతికి ఉన్నాడో, లేదో అని వాడు వెనక్కుతిరిగి చూశాడు. ఆశ్చర్యం. పండితుడు పడవను చేత్తో లాగుతూ, నీటిపై నడుస్తూ ఒడ్డుకు రాసాగాడు.

ఒడ్డుచేరుకున్న పండితుడి కాళ్లమీద పడ్డాడు సరంగు. 'మహానుభావా! నాకు ఈతవచ్చుననే గర్వంతో మిమ్మల్ని హేళన చేశాను, క్షమించండి' అన్నాడు.

పండితుడు వాడిని లేవదీసి 'చూడు, విద్యలునేర్చుకుంటే అవి ఎప్పటికైనా ఉపయోగపడతాయి. నాకు విద్యలు వచ్చు, వాడికి రావు అనే గర్వం ఉండకూడదు. ప్రతివాడిలోను ఏదో ఒక ప్రతిభ ఉంటుంది. దాన్ని గ్రహించగలగాలి. అదే మనం తోటి మనిషికిఇచ్చే గౌరవం. నాకు ఈతవచ్చు, ఐనా నీ పడవ నీకు దక్కితే నీ భుక్తికి లోటుండదని నీటిమీద నడుస్తూ, పడవను తీసుకొచ్చాను. నీటిమీద నడిచే విద్యకూడా నాకు వచ్చు' చెప్పాడు పండితుడు.

అప్పటినుండి పడవవాడు, ఆ పండితుణ్ణి కలుస్తూ, అనేక విద్యలు నేర్చుకుని తన జీవితాన్ని మెరుగుపరచుకొన్నాడు.

–కంచనపల్లి వేంకట కృష్ణారావు

# తేడాలు గుర్తిస్తారా

# దాగిన బొమ్మలు

పిల్లలూ! పైచిత్రంలో మనుషులు.. చెట్లు, జంతువులు, వస్తువులు ఎన్నో దాగి ఉన్నాయి. పజిల్ కింద ఇచ్చిన బొమ్మల్ని పరికించి, పజిల్‌లో అవిఎక్కడ దాగి ఉన్నాయో జాగ్రత్తగా గమనించి గుర్తిస్తారా.



వార్త ఆదివారం

## నల్ల ఆవు

**బాలగీతం**



నల్ల ఆవు నా చేనుకొచ్చింది
చేలో గడ్డంతా మేసింది
అంబా అంబా అని అరిచింది
నెమరువేసుకుంటూ
పడుకుంది
సాయంత్రం ఇంటికి వచ్చింది
తొట్టెడు కుడితి తాగింది
కడివెడు పాలు ఇచ్చింది!

అమ్మ పాల కడవ తెచ్చింది
పాలు పొయ్యిమీద పెట్టింది
పాలను మరగకాచింది
మందంగా మీగడ కట్టింది
పంచదారను బాగా కలిపింది
మీగడేమో బుజ్జి స్వీటీకి
పాలేమో చిట్టి మిల్కీకి!

-కందేపి రాణీప్రసాద్

**తేడాలు గుర్తిస్తారా**
**జవాబు**

1.బ్యాగు లేదు.
2.పుస్తకం లేదు.
3.D అక్షరం లేదు.
4.M అక్షరం లేదు.
5.చెట్టుకు లైట్లు లేవు.

## హలో ఫ్రెండ్...



**చిన్నారుల ప్రశ్నలకు**

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

**గిరీష్ అంకుల్ సమాధానాలు**

**టి.కావ్య, నల్గొండ.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. నర్సరీలలో, మరికొన్ని చోట్ల మొక్కలు పెంచే ప్రాంతంలో ఆకుపచ్చని తెరలను ఏర్పాటు చేయడం గమనించాను. ఇలా ఎందుకు చేస్తారు? దాని వల్ల ప్రత్యేక ఉపయోగం ఏమైనా ఉందా? దయచేసి చెప్పండి.**

**జవాబు:** కావ్యా! మామూలు వాతావరణంలో పెరగడానికి అనుకూలంగాలేని కొన్ని సున్నితమైన మొక్కలను ఆకుపచ్చని రంగుగల తెరలతో నిర్మితమైన షెడ్‌లలో పెంచుతారు. ఆకుపచ్చ తెరల ఏర్పాటు వల్ల ప్రత్యేక ఉపయోగం ఉంది...అది.. మొక్కలు ఎదగడానికి గాలిలోని కార్బన్ డై ఆక్సైడ్‌ను తీసుకుని ఆక్సిజన్‌ను వదిలిపెడతాయి. షెడ్ పైకప్పు నుండి సూర్యకిరణాలు లోపలికి ప్రవేశిస్తాయి. షెడ్ ఉష్ణోగ్రత పెరుగుతుంది. వేడి పరారుణ వికిరణాల (ఇన్‌ఫ్రా రెడ్ కిరణాలు)ను పరావర్తనం చేస్తాయి. కానీ పై కప్పు అడ్డుకోవడం వలన షెడ్ ఉష్ణోగ్రత పెరుగుతుంది. ఈ ఉష్ణోగ్రత వద్ద తక్కువ సాంద్రత గల ఆక్సిజన్ పైపొరలో, ఎక్కువ సాంద్రత గల కార్బన్ డై ఆక్సైడ్ అడుగు భాగాన వ్యాపించి ఉండటం వలన కార్బన్ డై ఆక్సైడ్ మొక్కలకు ఎక్కువగా లభించి తొందరగా పెరుగుతాయి.గ్రీన్ హౌస్‌లలో పెంచడంవలన పూలు, పండ్లు, కూరగాయల ఉత్పత్తి రెండు, మడు రెట్లు అదనంగా పెరుగుతుంది. గ్రీన్ హౌస్ ప్రభావం వలన భూ ఉపరితలము సమశీతోష్ణ స్థితిని పొంది పచ్చదనం సంతరించుకుంటుంది. గ్రీన్ హౌస్ ప్రభావమే లేకుంటే ఈ భూగోళం హిమగోళంగా మారిపోయి జీవజాతుల మనుగడ లేకుండాపోయేది.

**వి.సుహాస్, గుంటూరు.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. భూ గ్రహాన్ని నీలిరంగు గ్రహం అని ఎందుకు అంటారు? దయచేసి చెప్పండి.**

**జవాబు:** సుహాస్! భూగోళాన్ని నీలిరంగు గ్రహం అని పిలవటానికి అనేక కారణాలు ఉన్నాయి. ప్రధానంగా చెప్పాలంటే మన భూగోళం అధికశాతం నీటితో నిండి ఉంది. మొత్తం భూభాగంలో దాదాపు 70శాతం నీరే ఉంది. ఈ కారణంగా ఉపగ్రహం, భూమి ఛాయాచిత్రాన్ని తీసినపుడు అది చాలా వరకు నీలం రంగులో ఉంటుంది. మరో కారణం చెప్పాలంటే..మన వాతావరణం, ఆకాశం రంగు కూడా నీలమే. అందువల్లే భూగ్రహాన్ని నీలిరంగు గ్రహం అని పిలుస్తుంటారు.



# ఆత్మీయతానురాగాల రక్షాబంధనం..

–ద్యాప వనిత విజయకుమార్

శ్రావణమాసం శుక్లపక్ష పౌర్ణమి రోజున వచ్చే పవిత్ర పర్వ దిన్నాన్ని 'శ్రావణ పౌర్ణమి' అంటారు. ఈరోజున రాఖీ పౌర్ణమి, జంధ్యాల పౌర్ణమి, రక్షికా పూర్ణిమ, ర్రఖీ, సాలునో, సారవీ పూర్ణిమ, 'నారికేళ పూర్ణిమ, నార్ల పున్నమి.. ఇలా వివిధపేర్లు గల పండుగలను భారతదేశమంతా జరుపుకుంటారు. పూర్ణిమనాడు సంపూర్ణ చంద్రదర్శనం లభిస్తుంది. మనసుకు చంద్రుడు అధిపతి కావడం వల్ల సంపూర్ణ చంద్రదర్శనం వల్ల మనస్సు ఉప్పొంగి ఆనంద సంద్రమవుతుంది. సముద్రుడు ఉవ్వెత్తున లేచే కెరటాలతో ఎగిసెగసి పడతాడు. ఎగిసిపడే అలలతో తన ఉత్తుంగ తరంగాలతో మానవాళికి ఆనందం కలిగిస్తాడు.



భారతదేశంలో రాఖీ పండుగ ముఖ్యంగా ఉత్తరాదివారి సంప్రదాయం అయినప్పటికీ దక్షిణాదికి కూడా సంక్రమించడం వల్ల యావత్ భారతదేశంలో జరుపుకొంటున్నారు. అక్కాచెల్లెళ్లు, రాఖీని తమ సోదరులకు కట్టిన సందర్భంగా వారికిబహుమతులు యివ్వడంతోపాటు, తమ అక్కచెల్లెళ్ల రక్షణ బాధ్యతను తమ విధిగా భావించడం ఈ పండుగలోని ఆంతర్యం. ఒకరి సుఖాన్ని, ఉజ్జ్వల భవితవ్యాన్ని మరొకరు కాంక్షించి, ఆనందాన్ని పంచుకుంటారు. అమ్మాయిలు తమ అన్నదమ్ములకు రాఖీలు కట్టి వారి క్షేమం కోసం భగవంతుని ప్రార్థిస్తారు. తొలుత ఇది కేవలం నూలుపోగుగానే ఉండేది. కానీ క్రమేణా నగిషీ లతో ప్లాస్టిక్, చెమ్కీ రంగురంగుల అట్ట ముక్కలు మొదలు వెండి, బంగారు రాఖీలు ఎవరి తాహతుకి తగ్గట్లు కారికి అందుబాటులో ఉంటున్నాయి. పూర్వం ఉమ్మడి కుటుంబాల్లో ఆప్యాయతానురాగాలుండేవి. ఇప్పుడు దీన్ని ఒక వేడుకగా, ఫ్యాషన్‌గా జరుపుకుంటున్నారు. మనుషుల్లో ప్రేమను, మమతను పరిమళింపజేయడం కోసం గురుదేవ్ రవీంద్రనాథ్ ఠాగూర్ తన శాంతినికేతన్‌లో ఈ రక్షాబంధన్ కార్యక్రమం ఏర్పాటుచేసేవారు. ఇప్పుడు  చిన్ననాటినుంచే పిల్లలకు అవగాహనకోసం నేడు ఎన్నో విద్యాసంస్థలు ఈ రాఖీ బంధనోత్సవాన్ని చిన్నారులతో జరిపించడం తెలిసిందే.



ఇకపోతే వ్యాపారులకు లాభాల పంట పండిస్తోంది ఈ పండుగ. నేడు అయిదు రూపాయల ధర మొదలుకొని లక్ష రూపాయల వెల గల రాఖీలు లభిస్తున్నాయి. ఒకప్పుడు కేవలం సంప్రదాయ విక్రయాలకే పరిమితమైన రాఖీలు ఇంటర్నెట్ పోర్టళ్ల రాకతో ఆన్‌లైన్‌లోకి వ్యాపిం చాయి. దేశ విదేశాల్లో ఎక్కడున్నా మేమున్నామంటూ రాఖీలతోపాటు వారికి కావలసిన బహుమతులు, మిఠాయిలు తదితర వస్తువులను చేర్చడంలో ఎన్నో కంపెనీలు పోటీ పడుతున్నాయి. ఎంత డబ్బు ఖర్చయినా ఫర్వాలేదంటూ కేవలం సోదరీసోదరుల సొంతం కాదంటూ కుటుంబమంతా కూడా దీనిలో పాల్గొని మురిసిపోవడం జరుగుతోంది. తమ పిల్లలమధ్య, స్నేహితుల పిల్లల మధ్య పెంపొందే అనురాగాల విలువను ప్రతి కుటుంబం కూడా ఆహ్వానిస్తోంది, ఆస్వాదిస్తోంది.

**భిన్నత్వంలో ఏకత్వసాధన** ..భారతదేశం పలుభాషలు, కళలు, సంస్కృతులు, జాతులు తదితర ఎన్నో అంశాలలో భిన్నత్వాన్ని కలిగివుంది. ఇలాంటి భిన్నత్వంలో ఏకత్వం సాధించబడాలంటే రాఖీపండుగ ఆవశ్యకత ఎంతైనా ఉంది. సోదరి, సోదరునికి రక్షాబంధనం కడుతూ, 'మహాబలవంతుడు, దాన శీలుడు, రాక్షసరాజైన బలి చక్రవర్తిని దేవతల కోరికపై విష్ణువు తన శక్తితో బంధించాడు. అంతటి విష్ణు శక్తి కలిగిన రక్షాబంధన్‌ను నీకు కడుతూ నిన్ను బంధించు చున్నాను. ఆ శక్తి నిన్ను ఎల్లవేళలా కాపాడుతుంది. ఓ రక్షాబంధనమా! నీవు స్థిరత్వంతో ఉందువుగాక' అంటూ నోటికి తీపిని అందిస్తుంది. సోదరుని జీవితం ఎల్లప్పుడూ తీయగా సాగిపోతూ, తలపెట్టే ప్రతి కార్యం విజయవంతంకావాలని, అతనికి సర్వ సౌభాగ్యాలు, ఆయురారోగ్యాలు కలగాలని మనస్ఫూర్తిగా ప్రతి సోదరి దైవాన్ని స్మరించు కుంటుంది.




రాఖీ కట్టేందుకు వేలాది కి.మీ. వ్యయ ప్రయాసల కోర్చి వెళ్లనక్కర లేకుండా ఇంటర్నెట్ సహకరిస్తోంది. ఆకర్ష ణీయమైన ప్యాకింగ్‌తో ఆన్‌లైన్ షాపింగ్ పోర్టళ్లు, కొరియర్ కంపెనీలు వినియోగదార్లను విశేషంగా ఆకట్టుకుంటున్నాయి. అందంగా నగిషీలు చెక్కిన చెక్కపెట్టెల్లో రాఖీ, తిలకం ఉంచి, బహుమతి రూపంలో కొరియర్ సంస్థలు అందజే స్తున్నాయి. ఇక సోదరులు పంపే బహుమతులను భద్రంగా ప్రత్యేక ప్యాకింగ్‌తో చేరవేస్తున్నారు. అయితే ఖరీదైన రాఖీలే కట్టాలని ఏమీ లేదు. ప్రేమతో తమ తాహతుకు తగ్గ రాఖీ కట్టవచ్చు. అలాగే బహుమతులనాశించి రాఖీ కట్టడం పద్ధతి కాదు. నిస్వార్థంగా, ఆప్యాయంగా కట్టేదే రాఖీ.  మిధ్యాడంబరాలు, పెట్టుపోతలకి ఆశిస్తే ఈ పండుగ శుద్ధ అర్ధ రహితమే అవుతుంది. ఒకరిని ఇబ్బంది పెట్టేది కాకుండా, ఆప్యాయతలను, సంతోషాన్ని పంచుకుంటేనే అసలైన రాఖీ పండుగ. ■

# స్నేహం సంజీవని..



## నేడు ఫ్రెండ్‌షిప్ డే!

'ఒంటరైనా ఓటమైనా వెంట నడిచే నీడ నువ్వే...
తడి కన్నులనే తుడిచిన నేస్తమా...
ఒడిదుడుకులలో నిలిచిన స్నేహమా..'

టీవీలో వస్తున్న ఆ పాటను చూసి గర్వంగా నవ్వుకున్నారు ఆ స్నేహితులిద్దరు. ఎందుకు గర్వపడరు మరీ! వారి స్నేహానికి అప్పటికే పాతికేళ్లు నిండిపోయాయిగా! అప్పుడే టిఫిన్ చేస్తున్న తమ పిల్లల్ని చూసుకున్నారు. వారిని చూస్తుంటే 'నువ్వులేక నేను లేను', 'నువ్వే కావాలి' సినిమాల్లో కథానాయకుల్లా కనిపించారు.

క్రమేపీ కాలం గడిచిపోయింది. 2017లోకి క్యాలెండర్ తిరిగింది.

'ఈరోజు ఏ డ్రెస్ వేసుకుంటే సెల్ఫీ బాగా వస్తుంది?' అని ఆలోచిస్తుంది ఆమె.

'ఈ ఫోటో అప్‌లోడ్ చేస్తే లైక్‌లు ఎన్నొస్తాయో... కామెంట్లు ఎందరు చేస్తారో...' అని ఉక్కిరిబిక్కిరి అవుతుంది ఆమె.

'అబ్బా! మొత్తానికి ఈ ఫ్రెండ్‌షిప్ డేకి ఫ్రెండ్స్‌తో సెల్ఫీ దిగేసి ఫేస్‌బుక్, ఇన్‌స్టాగ్రామ్‌లలోపెట్టేశాను. ఇంకొన్నాళ్ల వరకు వారి మొహాలు చూడకపోయినా ఫర్వాలేదు..' అని ఓ కొత్తలోకంలో విహరిస్తున్నాడు అతను.

తరాలు మారాయి, మారుతూనే ఉన్నాయి. కొన్నివేల సంవత్సరాలుగా...కానీ స్నేహానికి నిర్వచనం మారలేదు..పాతనీరు పోయి,, కొత్తనీరు వచ్చి చేరినా మనసులో ఆ తడిపోలేదు.

కానీ 21వ శతాబ్దంలో ఇప్పుడిప్పుడే నిర్వచనం మారిపోవడం మొదలైంది. వాట్సప్ జనరేషన్‌లో యువత స్వాంతన పొందేది వ్యక్తుల స్నేహంతో కాదు..సోషల్ నెట్‌వర్కింగ్ మీడియాలోని లైకులు, కామెంట్ల గుర్తింపుతో...ఓ కృత్రిమ ప్రపంచంలో సెల్‌ఫోన్‌తో స్నేహంతో ప్రపంచాన్ని మర్చిపోయే స్థాయికి వెళ్లడం ఏ టెక్నాలజీ ఎదుగుదలో విశ్లేషకులే చెప్పాలిమరి!

స్నేహం అన్నది యుగయుగాల మానసికోల్లాస ఇంధనం. హరిహరులు, శ్రీకృష్ణుడు, కుచేలుడు, సుగ్రీవ, ఆంజనేయులు..ఇలా ఎందరో స్నేహం గొప్పదనాన్ని చాటినవారే.

'ఇలాంటి వారితోనే స్నేహం చేయాలి. అలాంటి వారితో చేయ కూడదు' అంటూ ఎన్నో భావనలు వచ్చినా ఒక్కసారి స్నేహం మొదలెట్టాక తప్పొప్పులు, లోపాలు మర్చిపోయి ఒకరికై ఒకరు నిలిచిన స్నేహితులు పురాణాల నుండి మొన్నీమధ్య దాకా మనమధ్య ఉన్నవారే.

నిజోజ్వలత్కవచుడు, శశ్వత్కుండలోద్భాసితుడు, జగత్కర్ణపూరాణ్లోలద్గుణుడు అని కర్ణుడు గురించి నన్నయ మహాభారత సభాపర్వంలో వర్ణిస్తాడు. పుట్టుకతో అసాధారణ శక్తిసంపద కలిగినటువంటి కర్ణుడు కౌరవులనే మిత్రులుగా భావించి చావు తథ్యం అని తెలిసినా వారితోనే నిలబడ్డాడు. దీని ఉద్దేశం చెడ్డవారితో స్నేహం చేయమని చెప్పడం కాదు..ఒక్కసారి స్నేహితులు అన్నాక...అదే భావం మనసులో గాఢంగా ముద్రించుకుపోయాక..ప్రపంచంలో ఎవరు ఎదురొడ్డినా స్నేహితులకోసం నిలబడటమే 'స్నేహం' చేసే అద్భుతం. స్నేహానికి మనిషికి ఉన్న సంబంధంఏమిటి? ఈ విషయం లోతుగా ఆలోచిస్తే 'మానవ సంబంధాలు' అని అర్థమవుతుంది.

'శత్రువు ఒక్కడైనా ఎక్కువే. మిత్రులు వందమంది అయినా తక్కువే' అన్నాడు వివేకానందుడు. మిత్రులకి, జీవితానికి ఉన్న సంబంధం ఏమిటి? అసలు మిత్రులున్న వ్యక్తికి, లేని వ్యక్తికి ఉండే వ్యత్యాసం ఏమిటి? ఆనందానికి, మిత్రులకిఉన్న సంబంధం ఏమిటి?

మనిషి సంఘజీవి. అంటే దానికి అర్థం ఒంటరిగా బతకలేడనేగా! ప్రతి మనిషి జీవితంలో సర్వసాధారణమైన సంతోషాలు, దుఃఖాలు ఒంటరి అంశాలు కావు. తమ గెలుపును నలుగురితో పంచుకోవాలని, విషాదాన్ని మనసు విప్పి మనసుకు దగ్గరైన వారికి చెప్పుకొని దాన్ని తగ్గించుకోవాలని ప్రతి మనిషి అనుకుంటాడు. ఆ ఓదార్పుని నమ్మకస్తుల దగ్గర పొందాలనుకుంటాడు.

ఎప్పుడైతే ఓమనిషికి సుఖదుఃఖాలు పంచుకోవడానికి స్నేహితులు లేకుండా పోతారో అప్పుడు ఆ వ్యక్తి మనసులోని భావాలకి వెంటిలేషన్ లేకుండా పోతుంది. మనసు నిండా పేరుకు పోయే భావజాలం, బాధలు, పంచుకోవాల్సిన జ్ఞాపకాలు మనిషిలో అసహనాన్ని పెంచుతాయి. అసహనంతో మొదలయ్యే ఈ ప్రక్రియ న్యూనత, డిప్రెషన్‌లకి కూడా దారితీస్తుంది. స్నేహం అన్నది ఓ ఆప్షనల్ అంశం కాదు. వ్యక్తికి, సమాజానికి మధ్య ఉన్న ఆరోగ్యకరమైన వారధి స్నేహం.

మారిపోతున్న ఈ అంతర్జాల యుగంలో కృత్రిమ సాంత్వనల్లో సేదతీరుతూ ఎల్లప్పుడూ అభద్రతా, న్యూనతల్లో గడిపే ఎంతోమందికి నిజంగా కావాల్సిన అమృత హస్తం ఈ స్నేహమే.

స్నేహం అన్నది ఎన్నటికీ వ్యక్తిగత అంశం కాదు, సామాజిక అంశమే. ఆరోగ్యకరమైన స్నేహాలే పటిష్టమయ్యే సమాజానికి చిహ్నాలుగా నిలుస్తాయి. ఒకప్పుడు నిజమైన స్నేహితులని చూసి సినిమాలు తీసేవారు. ప్రేక్షకులు తమ స్నేహాన్ని స్క్రీన్ మీద చూసుకునేవారు.

కానీ ప్రతీది ఫాంటసీగానే మారుతున్న నేటి యుగంలో సినిమాలు లేని స్నేహితులని, స్నేహాన్ని కృత్రిమంగా స్క్రీన్ మీద వెతుక్కునే ప్రక్రియలుగా మిగిలిపోయాయి.

ఏది ఏమైనప్పటికీ యువతలో నేడు పొడచూపుతున్న రుగ్మతలు చాలామటుకు ఒంటిరతనం నుండి పుట్టినవే. ఒకప్పుడు సంజీవనిగా నిలిచిన స్నేహగానం మాధుర్యాన్ని అందరూ ఆహ్వానిస్తూ బిజీలైఫ్‌లో 'ఫ్రెండ్స్ లైఫ్'కి కూడా కొంత ప్రాధాన్యత ఇవ్వాలని ఆకాంక్షిద్దాం.

–శృంగవరపు రచన




"ఏంటే, ఇంకా అలాగే కూర్చున్నావ్? తయారయి వుండమన్నాగా!" సింపుల్‌గా ఎప్పట్లా ఉన్న సుశీలని చూస్తూ చిరాగ్గా అన్నాడు శాంతిస్వరూప్. తను చెప్పిందేదీ జరగకపోయినా ఇట్టే కోపం వచ్చేస్తుందతనికి.

"ఈయనకి ఆఫీసు అర్ధరాత్రిదాకా వుంటే బాగుండేది. ఇంట్లోకి అడుగు పెట్టింది మొదలు చిరాకులు, అరుపులూ, గోలలు" మనసులోనే విసుక్కొంది సుశీల. అతడంతటి నసమేళం మరి.

# మనిషికో స్నేహం

– వాలి. హిరణ్మయీదేవి

"నాకు ఒంట్లో బాలేదు, మీరెళ్లిరండి" అంది ఎలాగో.

"ఎప్పుడూ ఏదో ఒక రోగమే. మా స్నేహితు లంతా వస్తున్నారు, మనం వెళ్లకపోతే బాగోదు, పిల్లలెలాగు లేనే లేరాయె. ఇలా సెలవులు రాగానే అలా అమ్మమ్మ ఇంటికి పంపించేశావ్. సర్సరే... ముందెళ్లి తయారవు, అప్పలమ్మలా తయార వ్వకు, మా కొలీగ్ గృహప్రవేశం, ఆఫీసు వాళ్లంతా వస్తారు" అన్నాడు స్వరూప్.

ఎప్పుడూ నెగ్గేది అతని మాటే, ఆ ఇంట్లో. భార్య కూడా ఓ మనిషేనని,ఆమెకూ కొన్ని ఇష్టాయిష్టాలుంటాయని తెలుసుకో(లే)ని ఎందరో మగాళ్లలో అతనూ ఒకడు.

"ఇంట్లో అతడేమన్నా ఎలాగోలా సర్దుకుపో తుంది. ఇక బైటకు వెడితే అస్సలు పట్టలేం. మనుషుల్ని చూస్తేచాలు రెచ్చిపోయి మాట్లా డుతుంటాడు, గొప్పలు చెప్పుకొంటుంటాడు, పిచ్చి పిచ్చి జోక్స్ వేస్తూ వుంటాడు. అలా చేయొద్దని ఎన్నిసార్లు చెప్పబోయినా విన్పిం చుకొంటేగా. అందుకే అతనితో బైటకు వెళ్లడాన్ని అవాయిడ్ చేయడం నేర్చుకొంది. కానీ ఒక్కోసారి వెళ్లక తప్పడం లేదు" అను కొంటూ, అయిష్టంగానే తయారై అతనితో వెళ్లింది సుశీల.

"మరబొమ్మలా బిగుసుకొని వుండకు, మా ఫ్రెండ్స్ పలకరిం చినా, జోకులు వేసినా కాస్త నవ్వుతూ వుండు" బైక్‌ని పార్కింగ్‌లో ఆపుతూ, భార్యని హెచ్చరించాడు శాంతిస్వరూప్.

ఎప్పట్లాగే తలూపక తప్పలేదామెకి.

ఇద్దరూ లోపలికి వెళ్లారు. కాస్సేపయ్యాక "నువ్వెళ్లి గిఫ్ట్‌ని ఇచ్చిరా" అన్నాడు శాంతిస్వరూప్.

అప్పటివరకూ ముళ్లమీదున్నట్లున్న సుశీల అతనిచ్చిన కవర్ తీసుకొని, అటుగా వెళ్లింది. అదిచ్చేసి వస్తూ "ఏవండీ, ఈ ఫంక్షన్‌కి నా ఫ్రెండ్స్ కూడా వచ్చారు. అక్కడ కూర్చుం టానండి" అంది, సుశీల బతిమాలుతూ.

"ఊఁ... సరే, అరగంటలో రావాలి" అంటూ ఫ్రెండ్స్‌తో మాటల్లో మునిగాడు శాంతిస్వరూప్.

చాలా రోజులకి కలుసుకొన్నారేమో సుశీల, ఆమె ఫ్రెండ్స్ ప్రేమా, నవ్యలు గల గలా మాట్లాడుకోసాగారు. అరగంట తర్వాత వారితో "మొత్తానికి మీరిద్దరూ మీరు కోరుకొ న్నట్లుగా ఉన్నారు. కానీ నేనే నాటకంలో ఇష్టంలేని పాత్రని పోషిస్తున్నట్లుగా... ఇక ఆపై చెప్పలేకపోయింది సుశీల.

"ఏంటే? ఏమైంది?" ఆదుర్దాగా అడిగారు వాళ్లు.

"నా అడ్రెస్ ఈ పేపర్‌లో



రాస్తున్నాను. ఒకసారి రండి. నేనిక వెళ తాను. ఆలస్యం చేస్తే ఆయనకి కోపం వస్తుంది" అంటూ వారిదగ్గర సెలవు తీసుకొంది.

వెడుతోన్న సుశీల వంకే చూస్తూ "దాల్ మే కుఛ్ కాలా హై" అనుకొన్నారు ప్రేమా, నవ్యలు. ఫోన్‌లు, లెటర్స్ ద్వారానయినా 'టచ్'లో ఉండాలని నిశ్చయించుకొన్నారు.

మరుసటి రోజు ప్రేమ, సుశీల ఇంటికి వెళ్లింది. ఆమెని చూస్తూనే ఆనందంతో ఎదురెళ్లింది సుశీల.

"రావే, ఇల్లు తేలిగ్గానే దొరికిందా?" మంచినీళ్లు అందిస్తూ అడిగింది సుశీల.

"సాధించి శోధించి వచ్చానే తల్లీ" నవ్వుతూ అంది ప్రేమ.

"అప్పటి అల్లరి ఇంకా అలాగే వుందే నీలో. ఓ ఫోన్ చేయకపోయావా?"

"ఏయ్, ముసలమ్మలా ఏంటా మాటలు? 'అప్పటి' అంటావేం? మనం కలుసుకొని ఐదేళ్లేగా అయింది" అంది ప్రేమ.

"ఈ ఐదేళ్లలో ఎన్ని మార్పులో?" భారంగా అంది సుశీల.

"నేనో పిల్లాడికి, నువ్వో ఇద్దరి పిల్లలకు తల్లులమయ్యాం, అంతేగా. ఎటొచ్చీ నీలోనే మార్పు.. కళ్లకింద ఆ నల్లటి వలయాలేంటి? మీ ఆయన నిన్ను బాగానే చూసుకొంటు న్నాడా? ఎలా ఉంది ఆఫ్టర్ మారేజ్ లైఫ్?" సుశీల చేయి నిమురుతూ అడిగింది ప్రేమ.

"పెనంమీద నుండి పొయ్యిలో పడ్డట్లుందే. పెళ్లికి ముందు నాన్నా, అమ్మల ఆంక్షలు. ఇప్పుడు ఈయనగారివి. ఈయన్ని ఎదిరించి పుట్టింటికి వెళ్లినా ఆదరించే దిక్కు లేదు. దాంతో సర్దుకుపోక తప్పడంలేదు" వేదనగా అంది సుశీల.

"పెళ్లయిన కొత్తల్లోనే నువ్వు అతనికి నచ్చజెప్పాల్సింది"

"పెళ్లైన కొత్తల్లో ఉమ్మడి కుటుంబం. అందునా అన్నీ పాతకాలపు పద్ధతులు.

మా మామగారు చనిపోయాక విడి కాపురం మొదలైంది రెండేళ్లుగా. ఈయనకి బంధుప్రీతెక్కువ. ఇల్లెప్పుడూ సత్రంలా ఉంటుంది. బయటివారి ముందు నేను నోరెత్తలేను. ఎత్తినా ఏం లాభం?

నన్నో పురుగులా దులిపి మాట్లాడుతూ వుంటాడు. చేజేతులా నా పురువు నేను తీసుకోలేక, నోరు మూసుకొని పడి ఉంటున్నాను. సర్లే నా గొడవకేంగానీ నవ్య రాలేదేం?"

"నీకు తెలుసో లేదో నవ్య ఈ మధ్య రాజాతో ఉండటం లేదు. అభిప్రాయ భేదాలొచ్చాయ్, అందుకే అతడిని వదిలి ఊటీకి వెళ్లిపోయింది. అక్కడే జాబ్ రావటంతో ఇంచుమించు అక్కడే సెటిలైపోయింది. ఆఫీస్‌లో అర్జెంట్ మీటింగ్ వుండటంతో వెళ్లిపోయింది. మరోసారి నిన్ను కలుస్తానంది. ఫోన్ చేస్తూ ఉండమని దాని నెంబర్ ఇచ్చింది" అంది ప్రేమ.

"ముందునుండీ దానికి ధైర్యం ఎక్కువ. పోన్లే ఏకాకిగా అయినా స్వేచ్ఛగా, ఆనందంగా వుంది" అంది సుశీల.

మొదట్లో నవ్య స్వేచ్ఛాభావాలు విశృంఖలతలా అన్పించేవి. అందుకే అలా మాట్లాడగలిగినందుకు మనసులోనే ఆశ్చర్యపోయింది కూడా. ఏదైనా తనవరకు వస్తేనే తెలుస్తుందంటారు ఇందుకే కాబోలు" అనుకొంది సుశీల.

వేడి వేడి పకోడీలను ప్రేమకు అందిస్తూ "నీ గురించేమీ చెప్పనేలేదు. కోరుకొన్నట్లుగా ప్రేమించి మరీ జేమ్స్‌ని పెళ్లాడువుగా! ఎలా ఉంది మీ లైఫ్?" ఆసక్తిగా అడిగింది సుశీల.

"మా లైఫ్‌కేం? హాయిగా సాగిపోతోంది. ఎటొచ్చి అటువాళ్లుగానీ ఇటువాళ్లుగానీ ఎవరూ రారు. దాదాపు అంతా వెలివేశారు. కానీ అందుకు మాకేం బాధగా లేదు. మాకు ప్రైవసీగా ఉందని ఫీలవుతున్నాం. ప్రెగ్నెంట్ అయినప్పుడు, జాన్ చంటిపిల్లాడుగా ఉన్నప్పుడూ చాలా ఇబ్బంది పడ్డాను. కానీ జేమ్స్ కో-ఆపరేషన్‌వల్ల నెట్టుకొచ్చాను. ఓ రెండేళ్లు లీవ్ పెట్టాను. తర్వాత ఆయాని ఏర్పాటు చేసుకొన్నాను. అందుకే ఇప్పుడు ఏ ఇబ్బందీ లేకుండా ఆఫీస్‌నీ, ఇంటినీ మేనేజ్ చేసుకొంటున్నాను" అంది ప్రేమ.

"ఈ చుట్టాలు, బంధువులూ ఎంత దూరంగా వుంటే అంత మంచిదేలే. మాకయితే వాళ్లమూలంగా కూడా గొడవలొస్తూనే వుంటాయ్. ఆ వచ్చేవాళ్లకి వండిపెట్టడంతోనే సరిపోతుంది నాకు. నాకంటూ ఓ లైఫ్ లేకుండా అవుతోంది. జాబ్ చేస్తానని ఎన్నోసార్లు అడిగి చూశాను.

"నువ్వెడితే ఎలా కుదుర్తుందంటూ" ముందరి కాళ్లకు బంధాలు వేస్తారు... దిగులుగా చెప్పింది సుశీల.

"మరి అంతమంది బంధువులున్నప్పుడు ఎవరికైనా నీ పిల్లల బాధ్యతని అప్పజెప్పి జాబ్‌కి వెడితే సరిపోయేదిగా".

"సరేలే. ఆ వచ్చేవాళ్లు నా సేవలను ఆశించేవాళ్లేగానీ, మాకింత సహాయం చేసే రకాలు కాదు. ఆ విషయం ఎన్నోసార్లు చెప్పాను కానీ చెవికెక్కించుకొంటేనా? నిరాశగా అంది సుశీల.

ఆమెను డైవర్ట్ చేయడానికన్నట్లు "మనం పకోడీలను వేసే శనగపిండిలో గుడ్లసొన వేసి కలిపితే మరింత రుచిగా వుంటాయ్ తెలుసా?" అంది ప్రేమ.

"నీకు నాన్ వెజ్ అంటేనే పడదు కదే!" ఆశ్చర్యంగా అంది సుశీల.

"కొత్తలో జేమ్స్ తింటున్నప్పుడు వామిటింగ్ సెన్సేషన్ కలిగేది. కానీ నా కోసం తన వారందరినీ వదులుకొని వచ్చిన అతనికి నచ్చిన ఫుడ్‌ని పెట్టకపోతే ఎలా? అనుకొంటూ వండటం మొదలుపెట్టాను. మెల్లగా రుచి చూడటానికి కూడా. ఇప్పుడు నాన్ వెజ్ లేందే నాకూ ముద్ద దిగటం లేదు. ఒకవేళ నేను చేయకపోతే అతనికి తనవాళ్లు ఎక్కువైపోతారుగా" నవ్వుతూ అంది ప్రేమ తమాషాగా కళ్లు ఆర్పుతూ.

మరికాసేపు మాట్లాడుకొన్నాక ప్రేమ తన అడ్రెస్ ఇచ్చి మరీ వెళ్లిపోయింది, తప్పకుండా రమ్మని మరీ మరీ చెప్పి.

* * *

"హు... అతని ఇష్టం వచ్చిన చోటుకి తప్ప, తను అడిగిన చోటుకి ఎప్పుడూ తీసుకెళ్లలేదు శాంతిస్వరూప్. తనెవరితోనైనా కాస్త చనువుగా మాట్లాడితే చాలు, అదోరకంగా చూస్తాడు. ఏనాడయినా కొంచెం టైమ్ దొరికి ఏ బుక్కో, పేపరో పట్టుకొంటే చాలు, ఏదో పని పురమాయించేస్తాడు. అతడు ఆఫీస్‌లో ఉన్నప్పుడు టీ.వి. ఏం చూస్తుందో కానీ తనకి నచ్చిన ప్రోగ్రాం ఏదీ చూడనివ్వడు. అతను చూసే ఆ సోది సీరియల్స్ అంటే తనకి నచ్చవు. అందుకే ఆ టీవీ జోలికి వెళ్లడం మానుకొంది. తరచి చూస్తే ప్రతీ విషయంలోనూ, తనే రాజీ పడుతూ వస్తోంది. కొత్తలో పెద్దలున్నారని, తర్వాత ఇరుగు-పొరుగువాళ్లు తమ గొడవలు వింటే తేలికైపోతుందని సర్దుకువచ్చింది. అదిప్పుడు అలవాటుగా, 'మస్ట్'గా మారిపోయింది.

భర్త తన మాట వినడం లేదని, అతడిని వదిలివెళ్లే 'తెగువ' లేదు.. నవ్యకున్నట్లు. తన మాటే నెగ్గించుకొంటూ, భర్తని తన కనుసన్నల్లోనే మసలుకొనేటట్లు చేసుకొన్న ప్రేమ తెలివితేటలు లేవు. తనలాంటిదానికి జీవితాంతం ఈ బాధ తప్పదు" నిరాశగా అనుకొంది సుశీల. సిగ్గుతో ప్రేమకి చెప్పుకోలేకపోయింది కానీ భర్తకీమధ్య తాగుడు అలవాటు అయింది. మానమని అడిగినప్పుడల్లా గొడవలే. ఒక్కోసారి చేయి చేసుకొంటున్నాడు కూడా. ఓసారి తండ్రికి చెప్పుకొంటే "అలాంటి చిన్న విషయాలని చూసీ చూడనట్లుండాలి. ఆఫీసన్నాక అవన్నీ మామూలే" అంటూ తనకే నచ్చజెప్పాడు. దాంతో నోర్మూసుకొని అతడినీ, ఆ కంపునీ భరించక తప్పటం లేదు.

తనూ నవ్యా, ప్రేమల్లాంటిదే. మరి వారికున్న ధైర్యం, స్థైర్యం తనకి ఎందుకు లేకుండా పోయాయి?" అని ఆలోచిస్తూ వుండిపోయింది. తన కాళ్ల మీద తను నిలబడకపోవటం వల్లే ఇవన్నీ భరించవలసి వస్తోందని" స్ఫురించింది చివరాఖరికి.

"తనని తాను సరిదిద్దుకోవాలి... ఎలా?" అన్న ఆలోచనకి బీజం పడిందామెలో.

* * *

చూస్తుండగా కాలచక్రంలో పదేళ్లు గిర్రున తిరిగాయి.

"జేమ్స్, ఈ మధ్య మరీ మెకానికల్ లైఫ్‌లా అన్పిస్తోంది. ఎటయినా వెడదామా" అడిగింది ప్రేమ.

"ఈ బిజినెస్ గొడవలతో నాకూ అలాగే వుంది. నువ్వే ఏదైనా ప్లాన్ చెయ్. వారం ముందుగా నాకు ఇన్‌ఫామ్ చేస్తే చాలు, ఆన్‌లైన్‌లో టికెట్స్ బుక్ చేయటం నీకు అలవాటేగా" అన్నాడు జేమ్స్.

"జాన్‌కి హాలిడేస్ ఎప్పట్నుండో కనుక్కొంటానైతే" అంటూ చెంగున లేచింది ప్రేమ.

* * *

"హాయ్ నవ్యా! మేం ఇక్కడున్నాం" చేతులూపుతూ అరిచి చెప్పింది ప్రేమ, స్టేషన్‌లో తమ కోసం వెదుకుతోన్న నవ్యని చూస్తూ.

చిరునవ్వుతో వారిని సమీపించింది నవ్య. తన కారులో వారిని తనింటికి తీసుకెళ్లింది.

హాండ్‌లూమ్ చీరలో హుందాగా అక్కడక్కడ నెరిసిన బాబ్డ్‌హెయిర్‌తో వింత అందాలొలుకుతున్న నవ్యని చూస్తూ-



"ఏం చేస్తున్నావే, ఇంత చక్కటి ఫిగర్ మెయిన్‌టెయిన్ చేస్తున్నావ్?" ఆరాగా అడిగింది ప్రేమ.

"చెబుతాలే కానీ, ముందు స్నానాదులు ముగించండి. మీ కోసమే ఇవాళ కిచెన్‌లో చాలాసేపు కసరత్తు చేశా" అంది నవ్వ నవ్వుతూ.

"నిజమే, ఈ భోజనాలయిపోతే ఇక మనం బోలెడు మాట్లాడుకోవచ్చు" అంటూ ప్రేమ, తనూ వడ్డనలో సాయం చేసింది.

"అదేంటే? నువ్వు భోంచేయవా?" అడిగింది ప్రేమ.

"నా భోజనం అయిపోయిందిలే. మీరు కానివ్వండి" అంటూ వారికి కొసరి కొసరి వడ్డించింది నవ్య.

భుక్తాయాసం, ప్రయాణపు బడలికల వల్ల జేమ్స్, జాన్ నిద్రలోకి జారుకొన్నారు.

నవ్యతో మాట్లడాలన్న ఆకాంక్ష, ప్రేమలోని బడలికని డామినేట్ చేయడంతో లాన్‌లోకి నడిచింది ప్రేమ. ఆకుపచ్చ తివాచీ పరిచిన ట్లుండా లాన్.

"అబ్బ... ఎంత ఆహ్లాదకరంగా వుందే ఈ వాతావరణం. ఎత్తయిన పచ్చటి చెట్లు. చల్లటి గాలి, ఇక్కడే ఉండిపోవాలనిపిస్తోందే" చిన్నపిల్లలా సంబరంగా అంది, ప్రేమ చుట్టూ చూస్తూ.

"ఉండిపోండి... నాకు తోడుగా. ఎలాగూ ఒంటరిదాన్నేగా" అంది నవ్య.

"అదేంటే, రాహుల్ ఏడీ? కన్పించడేం? అన్నట్లు బాబు పేరు సారీ మరిచిపోయా టింకూ కదా ఏడి? ఇప్పుడేం చదువుతు న్నాడు?" అడిగింది ప్రేమ.

"టింకూ అసలు పేరు ఉల్లాస్. టెన్త్ చదువుతున్నాడు, రెసిడెన్షియల్ స్కూల్‌లో. నాకూ, రాహుల్‌కి మధ్య పొరపొచ్చాలొ చ్చాయ్. నీకు తెలుసుగా, టింకూ రాజా కొడుకని. వాడితో రాహుల్ అంటీ ముట్టన ట్లుగా ఉండటం మొదలుపెట్టాడు. అదీ అతనో ఆఫీసర్ అయిందగ్గర్నుండి. రాహు ల్‌ని చదివించి మంచి ఉద్యోగస్తుణ్ణి చేయ డమే నా పొరపాటయింది. పోనీలే నా పేరు చెప్పకొన్నా చెప్పుకోకపోయినా ఎక్కడో ఓ చోట హాయిగా బతకనీ.

టింకూని తన కొడుకుగా చూసుకొంటా నని, జీవితాంతం తోడుంటానని అనబట్టేగా, రాజాని వదిలాక, అతడిని జీవితంలోకి ఆహ్వానించింది. అతనిలో మార్పు వచ్చాక అర్థమయింది. మగాడెప్పుడూ అవకాశవాదే నని. అందుకే ఇక జీవితంలో 'మగవాడి అండ' లేకుండా బతకాలన్న పంతం పెరిగి టింకూకి సింగిల్ పేరెంట్‌గా మారాను".

"మంచి పని చేశావ్. కానీ వాడినలా దూరంగా ఉంచడం దేనికి?"

"ఇక్కడివాళ్లు చేసే కామెంట్స్ వాడిని డిస్టర్బ్ చేయకుండా వుండాలని, ఇంకాస్త ఏజ్, జ్ఞానం వస్తే వాడే అన్నీ అర్థం చేసు కొనేవాడవుతాడు. వాడికో దారి చూపించి పెళ్లి చేసి పంపించేస్తాను. ఎవరిమీదా ఆధార పడను" అంది నవ్య ఖచ్చితంగా.

"కానీ ఈ ఒంటరితనం బాధించటం లేదా?" అడగలేక అడిగింది ప్రేమ.

"ఊహు... అస్సలు లేదు. నా మనసు డైవర్ట్ చేసుకొనేందుకైతేనేం, నాలో సహ జంగా చిన్నప్పట్నుండీ ప్రకృతిమీద వున్న ప్రేమవల్లనైతేనేం, మొక్కల పెంపకం, అడవుల పరిరక్షణ కార్యక్రమాల్లో పాల్గొనడం మొదలెట్టాను. నా లాంటి వారిని కూడగట్టు కొన్నాను. మేం నాటి మొక్కలు పెద్ద చెట్లుగా మారుతుంటే ఎంత ఆనందంగా వుంటుందో తెలుసా? ఈ కార్యక్రమం వల్ల నేను కలలో కూడా ఊహించని పేరు ప్రతిష్ఠలు, ఆదాయం, అన్నింటిని మించి ఎంతో మానసిక సంతృప్తి నా సొంతమ య్యాయి" తృప్తిగా చెప్పింది నవ్య.

"అప్పుడప్పుడు న్యూస్‌పేపర్స్‌లో నీ గురించి చదువుతూ వుంటాను. ఎంతో గర్వంగా ఫీలవుతుంటాను" మనస్ఫూర్తిగా చెప్పింది ప్రేమ.

"హేయ్! అదుగో సుశీల వస్తోంది. నేనే దాన్ని రమ్మన్నాను" అంటూ ఆమెకి ఎదురె ళ్లింది నవ్య. అనుసరించింది ప్రేమ.

ఇక ఆ ముగ్గురికీ టైమే తెలీలేదు కబుర్లతో.

"ప్రేమా! నువ్వొచ్చి వెళ్లాక నవ్య మా ఇంటికికొచ్చింది. మా ఆయనని కన్విన్స్ చేసి, నేను జాబ్‌లో చేరేలా చేసింది. నా పిల్లల్ని చూసుకోవటానికి ముందుకొచ్చిన మా బంధువుల్లో ఒకరైన మా వారి మేనత్తని మాకు పెద్ద దిక్కుగా మార్చింది. నేను ఆఫీస్‌కి వెళ్లడం మొదలెట్టాక బంధువుల తాకిడి కూడా తగ్గింది. అన్నింటిని మించి నాలో ఆత్మవిశ్వాసం పెరిగింది. ఇప్పుడు నాకెంతో గర్వంగా వుంది. మాది 'స్వీట్ హోమ్' అని చెప్పుకొనేలా చేసింది. నవ్య చలువ వల్లనే ఇదంతా" అంటూ నవ్య చేసినదంతా చెప్పుకొచ్చింది, సుశీల.

"జేమ్స్ బెంగళూరులో బిజినెస్ మొదలెట్ట డంవల్ల నాకూ హైదరాబాద్ నుండి ట్రాన్స్ ఫర్ అవడం వల్ల నిన్ను చాలా మిస్స య్యాను. ఎలా ఉన్నావోనని నవ్యతో ఎన్నో సార్లు అన్నాను కూడా. అయినా ఇదేదీ చెప్పనేలేదు చూడు" చిరుకోపంగా అంది ప్రేమ.

"ఇలా హఠాత్తుగా తెలిస్తే ఎంత బాగుందో! అనుభవంలోకి వచ్చిందిగా" నవ్యని సపోర్ట్ చేస్తూ అంది సుశీల.

"ముందు నీ గురించి తప్పుగా అనుకొనే దాన్ని. కానీ తర్వాత్తర్వాత నువ్వంటే ఏంటో, నీకు జరిగిన సన్మానాలు, వార్తలు, ఫొటోల ద్వారా తెలుసుకొన్నాను. మన ముగ్గురిలో నువ్వింత పేరు ప్రఖ్యాతులు సంపాదించటం, మాకెంత గర్వంగా ఉందో తెలుసా. అంతేకాదు, నా జీవితాన్ని ఓ కొలిక్కి తెచ్చిన ఘనతా నీదేనే" కృతజ్ఞతగా అంది సుశీల.

"బస్.. బస్.. ఇక ఆపవే. మన గురించి మనం పట్టించుకోవడమూ విశేషమేనా? సరేగానీ నా మీద మీకంత ప్రేమ, అభి మానం వుంటే నా కోసం మీరో పని చేయాలి. చేస్తారా? కాదు... కాదు... చేయవలసిందే!" నవ్వుతూ అంది నవ్య.

"తప్పకుండా చేస్తాం" ఇద్దరూ ఒకేసారిగా అన్నారు ప్రేమా, సుశీలలు.

"మీరూ మీ వంతుగా పర్యావరణ పరిర క్షణ గురించి నలుగురికి చెబుతూ వుండాలి. ఆ కార్యక్రమాల్లో మీ వంతు సహకారమూ అందించాలి".

"ఓ యస్. తప్పకుండా నువ్వింత చురు కుగా ఎలా పాల్గొంటున్నావో, అంత శక్తి నీకెలా వస్తోందో, ఆ రహస్యమేంటో చెప్పవే" ఇద్దరూ అడిగారు, నవ్యని.

"అది కూడా ప్రకృతి మహిమే. నేను వేపుళ్లకి, వండిన పదార్థాలకి తిలోదకాలి చ్చేశానే. పళ్లు, కూరగాయ ముక్కలు, ఆకుకూరలు, పుల్కాలు, సలాడ్లు, మొలకలు ముఖ్యాహారంగా మార్చుకొన్నాను, ఆరేళ్ల క్రితమే. అందుకే మీకన్నా చిన్నదానిలా ఆరోగ్యంగా కన్పిస్తున్నాను. కష్టమైనా మీరూ ఆ పనిని ఇష్టంగా చేయండే" నవ్వుతూ అంది, నవ్య.

"మా కోసమేగా నువు చెప్పింది. తప్ప కుండా ప్రయత్నిస్తాం" కోరస్‌గా అన్నారు, మనిషికి, మంచి స్నేహంకన్నా మించిన పెన్నిధి లేదనుకొంటూ.

■

## కార్టూన్లకు ఆహ్వానం

కార్టూనిస్టులనుండి ఆరోగ్యకరమైన హాస్యాన్ని అందించే కార్టూన్లను స్వాగతిస్తున్నాం. అంశం ఏదైనా సరే! మంచి హాస్యాన్ని అందించాలి. కార్టూన్లతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని కార్టూన్లను తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి. **కార్టూన్లు పంపించాల్సిన చిరునామా:**

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్-80.**

## ప్రేమ

ప్రేమ శాశ్వతమనుకున్నారు
కాని
దానికి పురి సడలిపోయింది.
హృదయంలో
సంతోషముంటేనే
అది చిరునవ్వులపై
పరావర్తనం చెందుతుంది.

మలిగిపోయే దీపానికి
కారణాలనేకం
రెండు మనసులు ఒకటే
అయితే
రెండో మాట ఉండేది కాదు
ఇవాళ
పరస్పర కర స్పర్శలో
అనుభూతి లోపించింది.

లోకమంతా
వారి ముంగిట్లోనే వుండేది
ఇప్పుడు
పక్షి ఎగిరిపోయిన
పంజరం మిగిలింది.

ఇదివరకు అక్షరాలు
వారి వెంటబడుతుండేవి
ఇప్పుడు
చుక్కలు లేని ఆకాశంలా
జీవితం పరుచుకుంది

కాపాడుకుంటందుకు
సాధ్యం కాని ప్రేమ
ఏ పాడు దీవులకో
ఎగిరిపోయింది.

– డా॥ ఎన్.గోపి

## నిరీక్షణ

ప్రేయసి కళ్లలో కదిలే మధుర భావనలు....
వెన్నెల కిరణాల్లా చల్లదనాన్ని పంచుతాయి..
హాయిదనాన్ని అందిస్తూ అలరిస్తాయి..
దూరమైన అందమైన ప్రణయ బంధం!
తన యదలో మెదిలే ప్రేమతాలుకు మధుర భావనలు
అంతరంగ మందిరాన్ని వీడి..
సాహితీ పరిమళాలు అద్దుకుని అక్షరాలై కాగితాలపై
వాలిపోతాయి.
కవితలై ప్రియుడి మనస్సుని హత్తుకుని
ఆనందింపజేస్తాయి!
ఇరు హృదయాల స్పందనలు ఏకమై, దూరాలను
దగ్గర చేస్తూ...
వెన్నెల లాంటి తన రాకకోసం నిరీక్షించేలా
చేస్తుంటాయి!

– జి.శ్రీను

## మమతానురాగాల సారం

ఒక కొలనులో విరిసిన కలువలు
ఒక చేతిలో పెరిగిన మొలకలు

రూపాలు వేరైనా భావాలు ఒకటే
ఒకే రక్తం ఒకే చిత్తం

చెల్లి కంటిలో కదిలే రూపం అన్న
అన్న గుండెలో వెలిగే దీపం చెల్లి

చెల్లి వదనాన విరిసిన నవ్వుల
పువ్వులే
అన్న సదనాన వెలుగును రవ్వల
దివ్వెలై

అన్న అండ చెల్లి ఆశలు నెరవేర్చు
బంగారుకొండ
అన్న దండ చెల్లి రక్షణకు నిలచిన
జెండా

చెల్లి మనుగడకు ఏడుగడ అన్న
అన్న బతుకులో జీవం చెల్లి

అన్న మురిపాలలో తేలి
అల్లారుముద్దుగా
అన్నా.. యని నోరారగ పిలుచుటే
వరముగా...



మమకారమనే అమృత వాహినికి ఇరు
తీరాలు అన్నా-చెల్లెళ్ల
అన్నా-చెల్లెళ్ల అనుబంధం
అభిమానానికి నిలయం
ఆత్మీయతకే రూపం మమతానురాగాల
సారం.

– చిరమన వెంకటరమణయ్య

## ఒంటరి పరిశోధన

ఎవరూ లేరనే ఎడారిలోనే
ఎంతో హాయిగా గడుపుతున్నా
భావాల వీధిలో పచార్లు కొడుతున్నా
ఆలోచనల లోగిలిలో అలా అలా తేలుతున్నా
పద్యాలు, గేయాలు, పల్లెపదాలు, పాటలు
పాడుకొంటూ పరవశిస్తున్నా
అన్నమయ్య, త్యాగయ్య, ఆత్రేయ,
శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి, సినారె
శరత్‌బాబు, కందుకూరి, గురజాడ, అజ్జాడ
ఒకరా... ఇద్దరా... ఎందరో మహామహులు
ఎక్కడనుంచో వచ్చి భుజం తట్టి పలకరించి
స్మృతి మిగిల్చి స్థిత ప్రజ్ఞత చేకూర్చి
కలలా కరిగిపోతుంటే
కళ్లు చెమ్మగిల్లుతున్నాయి. కలం, గళం కదులుతున్నాయి.
ఎంతటి అదృష్టం నాది... కాదు కాదు...
నాకు జన్మనిచ్చిన కన్నపేగుది
బాట తెలియని బాటసారిని
ఎవరూ లేని ఎడారి వాసిని
ఆశే శ్వాసగా మట్టివాసన
చూస్తున్న గట్టి మనిషిని.

ఇసుకరేణువుల్లోనే సింధువు దాగుందని
వెతుకుతున్న ఒంటరి పరిశోధకుడిని.

– పెట్ల వెంకటేశం

సింగిల్ పేజీ కథ

# రెండు చుక్కల కన్నీరు

– పక్కి రాధాగోపాలకృష్ణ

**సమయం తొమ్మిది కావస్తోంది. తెల్లవారుజామున లేచి కాలకృత్యాలు తీర్చుకొని రెడీ అయ్యేసరికి ఎనిమిదిన్నర. ఇక అరగంట మాత్రమే వున్నది ట్రైను వచ్చేందుకు.**

నా పిల్లలూ, భార్య అందరూ రెడీగా కూర్చొని వున్నారు. నేను "పదండి.. వెళ్దాం!" అంటేసరి...ఇంటికి తాళం వేసి, సామానులతో మెట్లు దిగాల్సిందే. ఈ ట్రైన్ తప్పిపోతే మరో ట్రైన్ లేదుగా! లేకుంటే బస్సులో వెళ్లాల్సిందే. అందులో బస్సు ప్రయాణం పడనివాళ్లను తీసుకుని వెళ్లటం కష్టమే. వారికై నిమ్మకాయలు చెంత వుంచుకోవాల్సిందే. కక్కు ఆపుకోవాలిగా!

ఇంతకీ హడావిడీ ఏమిటో చెప్పొద్దూ. మా చిన్నాన్న కూతురు, శైలజకి ఎల్లుండి పెళ్లి. ముందుగా రమ్మని మరీ మరీ చెప్పి వెళ్లిపోయారు పిన్నీ, చిన్నాన్న.

"ఎలాగైనా వస్తాం" అని హామీ ఇచ్చేసాం. ఎన్నో ఏండ్ల తర్వాత మా స్వంత ఊరుకి వెళ్తున్నాం. అదే ట్రైన్‌లో మా తమ్ముడి ఫ్యామిలీ, చుట్టాలు వస్తున్నారని ముందుగా తెలిపినందుకు బయల్దేరే ఆరాటం రెండింతలు అయ్యింది. రెడీగా వున్న పిల్లలూ, భార్యామణిని రిక్షాలో రైల్వే స్టేషన్‌కి పంపించాను.

నేను రైల్వే స్టేషన్ చేరి టికెట్లు తీసుకున్నాను. నేను ప్లాట్‌ఫామ్ మీదకు వచ్చిన ఓ ఐదు నిమిషాలకే ట్రైన్ రానేవచ్చింది. నా కళ్లు మా వాళ్లు ఎక్కడున్నారో అని వెదుకుతున్నాయి. అయితే మా అబ్బాయి మాత్రం వాడి తీక్షణ దృష్టి సారించి, "అదుగో చిన్నాన్న, పిన్నీ" అంటూ కేక వేసాడు.

మేమంతా అదే కంపార్టుమెంటులోకి ఎక్కాం. తతిమ్మా వాళ్లను పెళ్లిలో కలుసుకోవచ్చు.... అని మనసుని సముదాయించుకున్నాను. ఎవరి సీట్లలో వారు కూర్చున్నారు. ట్రైను కూత ముందుకు సాగుతూంది. మాటల్లో పడ్డారు నా భార్య, నా తమ్ముని భార్యా పిల్లలు అంతా. నాకు వేరేగా సీటు దొరికినందుకు నేను అక్కడ కూర్చున్నాను. ట్రైను కదలికతో నా మనసు నా అధీనం తప్పింది. గతంలోకి వెళ్లిపోయాను.

* * *

అవి నేను చదువుకునే రోజులు. నేనూ, నా ఫ్రెండ్స్ రోజూ ట్రైన్‌లో స్కూలుకి వెళ్లి వచ్చేవాళ్లం. ఆ రోజుల్లో ప్రతిరోజూ నేను ట్రైన్‌లో వెళ్లేసరికి ఎస్ఎమ్‌గారి అమ్మాయి లంగా, ఓణితో ముస్తాబై వారి ఇంటి కిటికీ దగ్గర కూర్చొని ట్రైన్ వెళ్లేవరకు వేచి చూస్తూ వుండేది. పేరు దుర్గలక్ష్మి. ముద్దుగా అందరూ లక్ష్మి అని పిలిచేవారు. బహుశా నా కోసమేమో! అని అనుకునేవాడ్ని. ట్రైన్ నడుస్తూ వుంటే టాటా చేసేది. సరదాకొద్దీ నేను కూడా చేయి ఊపి టాటా చెప్పేవాడిని. దుర్గలక్ష్మి కనురెప్పలార్పకుండా చూస్తూ తనూ టాటా చెప్పేది. వికసించిన ఆ మనోభావాలకు ఆ సంతోషం ప్రేమకోసమని ఎలా ఊహించగలం? ఐనా ఏదో ప్రేమ భావన లాంటిది మనసులో చోటు చేసుకున్నది. లేకపోతే ప్రతీరోజూ కిటికీవద్ద కూర్చుని టాటా చెప్పటంలో అర్థం ఏం వుంటుంది? అని నేను అనుకునేవాడ్ని.

రోజులు గడిచిపోతున్నాయి. నేను మెట్రిక్ పరీక్షలు రాసి ఊరికి వచ్చేసాను. ఊళ్లో వాళ్లందరూ నన్ను మెచ్చుకున్నారు. పల్లెటూరు వాతావరణం. ఈ సంవత్సరం గోపాలం మంచి మార్కులతో పాసైపోతాడన్నమాట. ఓ రోజు సాయంత్రం అలా రైల్వే స్టేషన్‌వైపు వెళ్లాను, అదీ పెద్ద పట్టుదలతో. ఏమైతేనేం! ఈ రోజు దుర్గలక్ష్మితో కలసి రెండు ముక్కలు మాట్లాడుతాను. నా ఈ ఆత్రుత రెట్టింపు అవుతోంది. గుండె కొట్టుకుంటూ వుంది, కలయిక క్షణం ఎప్పుడొస్తుందా? అని. లేని ధైర్యం తెచ్చుకుని మెల్లగా కిటికీ దగ్గరకు వెళ్లి "దుర్గలక్ష్మీ! లక్ష్మీ!" అని పిలిచాను, గొంతు సవరించుకుంటూ.

ఏదో ధ్యాసలో వున్న దుర్గలక్ష్మి హఠాత్తుగా నన్ను చూసి "అరె మీరా! ఇటువైపు వచ్చారు?" అని అడిగింది.

"లక్ష్మీ! నీతో కలసి మాట్లాడుదామని వచ్చాను"

"చెప్పండి... ఓ పది నిమిషాలు మాట్లాడుకోవచ్చు. మా అమ్మా, నాన్న ఇద్దరూ గుడికి వెళ్లారు" అని అంది.

"హమ్మయ్య వీలు కుదిరింది" అంటూ– "లక్ష్మీ! రోజూ నన్ను చూసి ట్రైన్ వెళ్లేవరకు టాటా చేసేదానివి. ఏ ఒక్కరోజూ మిస్ కాకుండా. నీ చేతుల ఆ చేయి ఊపు నన్ను పరవశుణ్ణి చేసింది. ఏదో కొత్త భావన నాలో చిగురించింది. నీ మోము నా మదిలో నిలిచిపోయింది. నిన్ను తలవని రోజు లేదు... క్షణం లేదు. ఎప్పుడెప్పుడు మెట్రిక్ పరీక్షలు అయిపోతాయా? సెలవుల్లో నిన్ను కలుసుకోవాలని ఎదురుచూస్తున్నాను. నా నిరీక్షణ నేటికి ఫలించింది. చెప్పలేని కుతూహలం తొందర చేస్తోంది, మనసులోని మాట నీకు చెప్పి పోదామని" అన్నాను.

"చెప్పండి. ఇంట్లోకి పిలవటం వీలు కుదరదు. కొంచెం సమయమే ఉంది" అని అన్నది.

"లక్ష్మీ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. చదువు పూర్తయ్యాక పెళ్లి చేసుకోవాలని అనుకుంటూ వున్నాను. ఏమంటావు?" అన్నాను.

"గోపాలంగారూ! మీరు నన్ను పెళ్లి చేసుకోవాలని ఎలా నిర్ణయం తీసుకున్నారు? నన్నసలు మీరు పూర్తిగా చూడనిదే! నేను అవిటిదాన్నండీ. నా రెండు కాళ్లు పని చేయటం లేదు. అందుకే రోజూ కిటికీ వద్ద కూర్చుని తెలియని వాళ్లకు, తెలిసినవాళ్లకు టాటా చెప్తుంటాను" అన్నది లక్ష్మి.

ఈ మాటలు గోపాలాన్ని ఒక్కసారి ఆకాశాన్నుండి కిందకు తోసినట్లు అనిపించింది. అందమైన మోము, ఆకర్షణీయమైన కళ్లు ఇచ్చి, ఈమెను భగవంతుడు ఎందుకిలా అవిటిదాన్ని చేసాడో అర్థం కావటం లేదు గోపాలానికి. ఆమె మాటలు విన్నాక కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి. రెండు చుక్కల కన్నీరు వాటంతట అవే రాలాయి. దుఃఖాన్ని దిగమింగి "సారీ లక్ష్మీ!" అని చెప్పి వచ్చేసాను.

ఈలోగా ఆమె అమ్మా-నాన్నలు వచ్చేసారు.

* * *

ట్రైన్ కూత కూస్తూ ముందుకు పోతోంది. మా స్వంత ఊరు దగ్గరవుతోంది. ఒక్కసారి ఉలిక్కిపడి చూస్తే తమ్ముడు భుజం తట్టి "అన్నయ్యా! మన ఊరి స్టేషన్ వచ్చేసింది. లేవండి" అని అనేసరికి నేను తేరుకున్నాను.

ఊళ్లో జరిగిన పాత స్మృతులు నెమరు వేసుకున్న మైకంలోంచి ఒక్కసారి వర్తమానంలోకి వచ్చాను. నా భార్య, మరదలు, తమ్ముడు, పిల్లలు అంతా ఏం మాట్లాడుకున్నారో నాకు తెలియదు. ఊరికి చేరాక సామాన్లతో ట్రైన్ దిగి నడుచుకుంటూ పోతూ వుంటే దోవలో నా ఫ్రెండ్ రామారావు కలిస్తే అడిగాను లక్ష్మికోసం.

అప్పుడు తెలిసింది... తనకి పెండ్లి అయినట్లు, ఇప్పుడు అత్తవారింట్లో ఉందని. ఇది విన్నాక నా మనసు కుదుట పడ్డది. సంతోషంతో రెండు చుక్కల కన్నీరు వాటంతట అవే రాలాయి. భగవంతుడు కరుణించాడు. థ్యాంక్ గాడ్! అంటూ సెల్యూట్ కొట్టాను. ■

ఒక గృహాన్ని సమకోణంతో కూడిన చతురస్ర లేదా దీర్ఘ చతుర స్రాకారంగా నిర్మించుకోవటం వాస్తు నియమాలలో ఒకటి. అయినప్పటికీ వీటిలో ముఖ్యంగా రెండు రకాల తీవ్ర దోషాలను కలిగించే నిర్మాణాలున్నాయి.

# చతుష్కోణ వేధ అంటే.. !?


## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ
డా॥ దంతూరి పండరినాథ్
3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3
సెల్స్: 9885446501/ 9885449458




ఒకటి(పటం-ఎ) స్థలం దిక్కులకు తిరిగినప్పుడు అంటే ఆ స్థలానికి తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ దిక్కులు మూలలకు రావటం వలన ఆ స్థలానికి దిగ్మూఢం ఏర్పడిందని పేర్కొంటారు. అటువంటి స్థలంలో ఇంటిని మాత్రం దిక్కులకు నేరుగా తిప్పి నిర్మించటం తీవ్రమయిన వాస్తు దోషాన్ని కలుగజేస్తుంది. ఇటువంటి వాస్తుదోషం 'చతుష్కోణ వేధ'గా పేర్కొనబడింది.




రెండవది: (పటం-బి) స్థలం దిగ్మూఢం ఏర్పడినదైనప్పుడు గృహం కూడా అదే పద్ధతిలో నిర్మించటం వలన ఆ గృహానికి కూడా దిగ్మూఢం కలుగుతుంది. ఇటువంటి గృహాలకు కూడా దిక్కులు మూలలకు రావటం వలన 'చతుష్కోణ వేధ' దోషం కలుగుతుంది.




దిగ్మూఢ స్థలాలకు కేవలం ఈశాన్యంలో వీధి వున్నప్పుడు (ఆ స్థలంలో కట్టే ఇంటికి ఈశాన్య ప్రధాన ద్వారం వున్నప్పుడు) మాత్రమే ఆ దోష తీవ్రత చాలా వరకు తగ్గి మంచి ఫలితాలనివ్వ గలుగుతుంది. పటం-ఎ స్థలం గృహం కూడా ఎట్టి పరిస్థితుల్లోనూ నివాసయోగ్యం కాదు. పటం-బి, స్థలం గృహంలో నివసించక తప్పనప్పుడు ఈశాన్య ద్వారం ఏర్పరచుకోవడం వలన కొంతవరకు మెరుగయిన ఫలితాలనాశించవచ్చు.

ఇటువంటి సందర్భాలలో (పటం-సి) ఈశాన్యంలో వీధి వున్నప్పుడు మాత్రమే ఈశాన్యంలో ప్రధాన ద్వారమేర్పరచుకోవాలి. వీధి ఎటువైపు వున్నప్పటికీ ఈశాన్యంలో ప్రధాన ద్వారమేర్పరచుకోకూడదు. వీధులు ఈశాన్య దిక్కుకు లేకుండా ఆగ్నేయ, నైరుతి, వాయువ్య దిక్కులకు వున్నప్పుడు ఈశాన్య దిక్కుకు ఒక సాధారణ ద్వారం ఏర్పాటు చేసుకోవటం వలన కొంత ఊరట దొరుకుతుంది. 'చతుష్కోణ వేధ'కు- దిగ్ మూఢ వేధకు ఎక్కువ సారూప్యతలుండటం వలన ఈ రెండు వేధలను ఒకే దోషం గల వేధలుగా పరిగణించటం పరిపాటి.




'చతుష్కోణ వేధ' దోషంగల గృహంలో నివసించేవారికి సంక్రమించే బాధల వలన సమస్తం కోల్పోయి దరిద్రులగుటకు, దేశదిమ్మరులగుటకు, స్థాన నాశనం పొందుటకు అవకాశాలెక్కువ. ఆయా క్షేత్రాల నైసర్గిక స్వరూపాలను అనుసరించి దోష తీవ్రత హెచ్చుతగ్గులవుతూ ఉంటుంది. ఇటువంటి క్షేత్రాలను, గృహాలను విసర్జించటమే మంచిది. హోమాలు, ధ్యానాలు, సత్సంగాలు, భగవన్నామ కీర్తనలు, జపాలు, తపాలు మొదలయిన ఆధ్యాత్మిక క్రియల వలన, దానాల వలన కూడా ఈ దోషపూరిత క్షేత్రాల దోష తీవ్రతను చాలావరకు తగ్గించుకొని సత్ఫలితాలను పొందుతూ వుండవచ్చు.

## గుమ్మాలు, కిటికీలు ఎటువైపు ఉండాలి?

**శాంతకుమారి - కరీంనగర్**

**ప్రశ్న: మా ఇంటికి సంబంధించిన ప్లాను మీకు పంపిస్తున్నాను. దానికి వాస్తు ప్రకారం గుమ్మాలు, కిటికీలు, ఎటువైపు వుండాలో తెలియజేయగలరు. తూర్పు భాగంలో వున్న పక్కవారి బేస్‌మెంట్ కంటే మేం 8॥ ఎక్కువ పెట్టాం. మేం పంపించిన ప్లాను ప్రకారం పడమరలో వున్న రెండు అడుగుల స్థలం కేవలం దారికి మాత్రమే. తలుపులు పెట్టడానికి కుదరదు. దక్షిణం నుంచి తూర్పు వైపుకు స్థలం పెరిగింది. మాకు ఇల్లు కట్టడం గురించి అంతగా అవగాహన లేదు. మేమిచ్చిన ప్లాను ప్రకారం ఏవి ఎటువైపు వుంటే మంచిదో తెలుపగలరు.**

**జవాబు:** మీరు పంపించిన స్థలం నమూనాను అనుసరించి అభిముఖంగా ఇల్లు కట్టుకోండి. సింహ ద్వారానికి ఎదురుగా గేటు, ఉత్తర ఈశాన్యంలో ఓ గేటు పెట్టుకోవచ్చు. దానివల్ల ఇంట్లోనుండి బయటకు నడిచేటప్పుడు మొదటి అడుగు తూర్పుకు, నడక ఉత్తర దిశగా సాగి రోడ్డుకు వస్తారు.

మీ ఇంటికి 4, 6 ద్వారాలు వుండేలా ప్లాను చేసుకోండి. ఎనిమిది కిటికీలు వచ్చేలా చూసుకోండి. అయితే మీరు పంపించిన ఇంటి ప్లానును సరిచేయడంతోనే పూర్తి వాస్తు ఫలితం చేకూరినట్టు కాదు. గృహ స్థలాన్ని, పరిసరాలను పరిశీలించి ఇంటి నిర్మాణం చేపడితే పూర్తి వాస్తు ఫలితాలు అందుతాయి. అందువల్ల మంచి వాస్తు పండితుణ్ణి తీసుకెళ్లి గృహ నిర్మాణాన్ని చూపించమని నా సలహా. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: **సాయిశ్రీ వాస్తు** కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ---------------------------------------
పుట్టినతేదీ:------------------ ఊరు: --------------
జన్మనక్షత్రం:---------తల్లిపేరు:---------------------
చిరునామా: ------------------------------------
------------------ ఫోన్: ---------------------

# మా అమ్మాయి మళ్లీ ప్రేమలో పడిందా?


## పర్సనల్ పాయింట్

చల్లా సుబ్రహ్మణ్యం

1 సి–ఐక్యూ టవర్స్, 3–4–540,

నారాయణగూడ, హైదరాబాద్–27

మొబైల్: 9866362224/ 9553662224

challascounsel@gmail.com

www.challascounsel.com




**ఎల్.వి – నల్గొండ జిల్లా**

ప్రశ్న: మా అమ్మాయి వయసు 20. బి.టెక్. థర్డ్ ఇయర్ చదువుతోంది. పాప ఇంటర్ రెండవ సంవత్సరం చదివేటప్పుడు ఒక ప్రేమ వ్యవహారంలో కూరుకుపోతే మీ దగ్గరకు తీసుకువచ్చాం. మీరు ఇచ్చిన రెండు నెలల కౌన్సెలింగ్‌తో ఆ ట్రాప్‌లో నుంచి బయటికొచ్చింది. బాగా చదువుకుంది. మంచి మార్కులతో ఇంటర్ పాసయ్యింది. ఒక మాటలో చెప్పాలంటే మా అమ్మాయి మాకు దక్కింది. మా కుటుంబం పరువు నిలబడింది.

ఈ మధ్య రెండు నెలల నుంచి పాప ప్రవర్తన మీద కొంచెం అనుమానం కలుగుతోంది. మళ్లీ ప్రేమలో పడిందేమో! అని భయం వేస్తోంది. ఒకప్పటి ఫ్రెండ్‌తో పడిందా? వేరే అబ్బాయిని ఎవరినైనా ప్రేమిస్తోందా? తెలీదు. మంచిగా మాటల్లో పెట్టి విషయం రాబట్టే ప్రయత్నం చేశాను. తను నవ్వుతూనే తేలిగ్గా తీసిపారేసింది. అయినా మా భయం, ఆందోళన ఏమీ తగ్గలేదు. మా అనుమానం పోలేదు. పాపని తీసుకుని ఓ రోజు వస్తాం. వాస్తవాలు గ్రహించి మా భయాలు పోగొట్టండి. మా అమ్మాయిని రక్షించండి.

జవాబు: అలాగే తల్లీ! పాపని మంచి 'మూడ్'లో తీసుకురండి. సమస్యకు పరిష్కారం ఒక రోజులోనా? వారం రోజుల్లోనా అనే విషయం ఇప్పుడు చెప్పలేను. అతిగా భయపడి అమ్మాయిని కంగారు పెట్టకండి. బలవంతంగా ఏదో చెప్పించే ప్రయత్నం చేయకండి.

### కలలు ఎక్కువ వస్తున్నాయట!

**లక్ష్మీశ్రీ – గుంటూరు**

ప్రశ్న: మా అమ్మాయి ఎం.బి.బి.ఎస్. ఫస్ట్ ఇయర్ చదువుతోంది. చిన్నప్పటి నుంచి తనకి చిత్ర విచిత్రమైన కలలు వస్తుంటాయి. భయంకరమైన కలలు, పీడ కలలు, స్నేహితులతో పోట్లాడే (fighting) కలలు, గాలిలో ఎగురుతున్నట్టు కలలు. ఇలా ఎన్నో రకాల కలలు వస్తుంటాయి. మరో విశేషమేమిటంటే వచ్చిన కల గురించి మర్నాడు ఎంత వివరంగా చెబుతుందంటే మనం ఒక సినిమా చూస్తున్నట్టే వుంటుంది. బహుశా ఈ కలల డిస్టర్బెన్స్ (disturbance) వల్లనేమో అమ్మాయి చదువులో డల్‌గా వుంటుంది. తెలివితక్కువదానిలా ప్రవర్తిస్తుంది. ఏకాగ్రత తగ్గిపోయింది. మీ మనోప్రాణయోగ (Mano Prana yoga) ద్వారా అమ్మాయి తెలివితేటలని పెంచుకోవచ్చా?

జవాబు: అమ్మా... ఎక్కువ కలలు కనేవారిలో సృజనాత్మక శక్తి (creativity).... విశ్లేషణా (analysis) ... తెలివితేటలు (IQ levels) ఎక్కువగా ఉంటాయి అని చదివాను. సో... మీరు అమ్మాయి మేధస్సు (intelligence) గురించి కంగారు పడకండి. అమ్మాయి డాక్టర్ అవ్వాలనే కలని సార్థకం చేసుకోనివ్వండి. ఏకాగ్రత కుదరడం లేదు అంటున్నారు. కనుక అమ్మాయిని తీసుకుని రండి. ఒక వారంపాటు ఏకాగ్రత సూత్రాలు (concentration techniques) నేర్పిద్దాం.

### మా ఆయనది దూకుడు మనస్తత్వం

**హె.పి.ఆర్ – హైదరాబాద్**

ప్రశ్న: సార్... నా వయసు 38. నా భర్త బస్ డ్రైవర్. మాకు ముగ్గురు పిల్లలు. పెళ్లైన మొదట్లో బాగానే వుండేవాడు. గత పది పన్నెండేళ్లుగా ఆయనకు అన్ని విషయాల్లో తొందరపాటుతనం, దూకుడు తత్వం, తనకు సంబంధం లేని విషయాల్లో (పిల్లల విషయాల్లో కూడా) తలదూర్చి గొడవలు పడటం, ఎదుటివారిని భయపెట్టటం లాంటి లక్షణాలు చోటు చేసుకున్నాయి. ఆయన ప్రవర్తన ఇంట్లోవాళ్లతో మాత్రమే ఇలా ఉంటుందేమో అనుకున్నా. కానీ ఇంట్లో ప్రవర్తన ప్రభావం తన వృత్తిమీద కూడా పడింది. డ్రైవింగ్ చేసేటప్పుడు ఎక్కువగా హారన్ (Horn) కొట్టి జనాలని భయభ్రాంతులని చేయడం, రోడ్డంతా తనదే అన్నట్లుగా ఏ లైన్‌లో పడితే ఆ లైన్‌లో దూరిపోయి తను డ్రైవ్ చేస్తోంది బస్సు కాదు... ఓ సైకిల్ ఏమో! అన్నట్లుగా నడిపిస్తున్నాడు. ఈ విషయం మా బంధువులు, ఆయన స్నేహితులు, చూసినవాళ్లు కూడా చెప్పారు. ఇదేంటని? ఎవరైనా గట్టిగా అడిగితే బూతులు తిట్టి మరీ సమాధానం చెప్తున్నాడట. ఇంట్లో వాళ్లది ఏ తప్పు లేకపోయినా ఆయనలో ఈ విపరీత ధోరణి ఎందుకుంది? పోగొట్టడానికి మార్గం ఏమిటి? మీరు కౌన్సెలింగ్ చేస్తారా? ఈయన ధోరణి మారకపోతే ఉద్యోగంలో కష్టం వస్తుందని భయంగా వుంది. ఈయనకు ఏమైనా ప్రమాదం జరుగుతుందేమో?



జవాబు: మీ బాధ నాకు అర్థమైంది తల్లీ. బస్సు డ్రైవర్ కదమ్మా... ఈయనకు ఏదైనా ప్రమాదం జరుగుతుందేమో! అని భయపడకు తల్లీ. నీ భర్తవల్ల మిగిలిన చిన్న ప్రాణులకి... మామూలు ప్రజలకి ఏం ప్రమాదాలు జరుగుతాయో అని మనందరం భయపడాలి. వీళ్లని ప్రజలు ఏమీ చెయ్యలేరు... పోలీసులు ఏమీ అనరు. నీ భర్త మనస్తత్వం, ప్రభావం, ఆయన వృత్తిరీత్యా అలవాటు అయిన పద్ధతులు ప్రభావం ఇంటి వాతావరణం మీద పడిందని నా అనుమానం.

ఏది ఏమైనా అకారణంగా బూతులు తిట్టడం, సంబంధం లేని విషయాల్లో జోక్యం చేసుకోవడం, ఉద్రేకపూరితమైన దూకుడు మనస్తత్వం ఆయనలోని మానసికి రుగ్మతకి నిదర్శనం. పిల్లల సహాయంతో ఆయనను తీసుకుని సైకాలజిస్ట్ (Psychologist)ని కలవండి.

# పద మథనం-125

- నిర్వహణ: వాడ్రేవు ఉమాశంకర్

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ● | 4 | 5 | | | 6 |
| 7 | | ● | | ● | 8 | | ● | ● | |
| | ● | 9 | | | | ● | 10 | 11 | ● |
| ● | 12 | ● | | ● | ● | 13 | | | 14 |
| 15 | | | | ● | 16 | ● | ● | 17 | |
| | ● | ● | ● | 18 | | 19 | | | ● |
| 20 | 21 | 22 | 23 | | ● | | ● | ● | 24 |
| ● | 25 | | | ● | 26 | | 27 | | |
| 28 | | ● | 29 | 30 | ● | ● | | ● | ● |
| | ● | 31 | | | ● | 32 | | | |

## ఆధారం

### అడ్డం

1. గోవుల గుంపు-4
4. రాజుగారి కుర్చీ-5
7. ద్వేషం, ఏదో చేసెయ్యాలన్నంత పగ-2
8. భూగర్భ సంపద దొరకాలంటే గజనిని మధ్యలోనే బలివ్వాలి-2
9. పరమాన్నం లాంటిదే... క్షీరంతో చేసే మధురమైన వంటకం-4
10. ఆదిలోనే హంసపాదు పడి, తారుమారయ్యింది-2
13. శవాన్నే కాదు.. దేన్నైనా భూమిలో పాతిపెట్టడమే-4
15. నిరాకారము, ఓంకారము అయినా కళ్లెదుట కనిపించే స్వరూపం-4
17. ఎద్దులా, మొద్దులా అనిపించినా అది కలదు-2
18. ఇల్లు ఊడిచేది-5
20. హరహర మహాదేవ,.......-5
25. జనక ఇలా చిందర వందర అయ్యావేంటయ్యా-3
26. తామరపూలకు రాజు-5
28. అట్లు దీనిమీదే పోస్తారు-2
29. వెలుగు-2
31. పాముకి బద్ధశత్రువు-3
32. సర్పఘాతం-4

### నిలువు

1. కడుపులో ఎలుకలు పరిగెడితే క్షుద్బాధే-3
2. వంద వేలు-2
3. పార్వతి తండ్రి చేసిన నిరీశ్వర యాగం ఇలా ప్రసిద్ధి-5
4. సింహానికి వికృతి-3
5. కీడు-2
6. ఉబ్బసంలో బుస కొట్టినట్టు ఎగూపిరీ దిగూపిరీ... ఆయాసం-2
10. ఎగువకి పారుతున్న నది-2
11. నీటి ప్రవాహాన్ని అదుపు చేయడానికి వేసే అడ్డుగోడ-4
12. వంపు తిరిగి ఉండే పెద్ద బూరా-2
14. గారాబంగా చూడడమే చుంబనం-2
15. అవకాశం దొరికితే విమానంలోనైనా తిరిగొద్దాం అనిపించే గగనం-3
16. సాధారణంగా చారులో చివరికి వేసేది-2
18. కోక-2
19. చేతివస్త్రం-3
21. ఆహారం-3
22. మనసులో ఓ మూల కలిగే అనుమానమే-2
23. బంగారు మేనిఛాయతో మెరిసిపోయే అంగన-4
24. చిన్న చెక్కముక్క-2
27. నవరత్నాలలో అత్యంత ఖరీదైనది. దానిని దానితోటే కోయాలి-3
28. పెనవేసుకు ప్రవహించే ఓ జీవనది-2
30. రూటు మార్చిన సతి-2

## పద మథనం - 123 సరైన సమాధానాలు రాసినవారు

1. ఎ.సత్యనారాయణ బాబ్జీ, సుమతి-నిజాంపేట రోడ్ 2. సి.సరోజ, సి.సుబ్బారావు, సి.లక్ష్మీ నరసింహమూర్తి, సి.పవన్‌కుమార్, సి.ప్రవీణ్‌కుమార్-సనత్‌నగర్ 3. కె.సుధాదేవి-చీరాల 4. యం.బాలగంగాధరయ్య-నాగోల్ 5. వి.దుర్గావివేకానంద-పాత బోయినపల్లి 6.వి.సుజాత-బైరాగిపట్టెడ 6. యం.వి.రమణకుమారి-హైదరాబాద్ 7. బి.సుజాత, బి.కృష్ణమూర్తి-హుజూర్ నగర్ 8. ఇ.శ్యామసుందర్, యస్.యస్.ఎగ్గోని, సి.రాజలక్ష్మి-పుప్పాలగూడ 9. ఎ.సుబ్బారావు-గుంటూరు 10. పి.శ్యామలా రాధాకృష్ణ-మదనపల్లి 11. సి.జి.శంకరరావు-డా॥ ఎ.ఎస్.రావ్ నగర్ 12. పి.రాజేశ్వరరావు-అలకాపురి 13. కె.లింగమ్మ, కె.శివాజిరెడ్డి-మాచర్ల 14. కె.వి. సుబ్బారావు-గిద్దలూరు 15. కె.సుధాదేవి-చీరాల 16. నిర్మలక్రిష్ణ-బైరాగిపట్టెడ 17. కె.ప్రేమ, వెంకటేష్, ఠాగూర్, ప్రిన్సీ, శ్రీమహాలక్ష్మి-గుంటూరు 18. హెచ్.జె.సువర్ణ-కర్నూలు 19. పి. జేసురత్నం-నరసరావుపేట 20. జె.కుమారస్వామి-పిడుగురాళ్ల 21. వి.బి.టి.సుందరి-సరూర్ నగర్ 22. ఎ.అన్నపూర్ణ-రామారావుపేట 23. కె.పాండురంగారావు-శ్రీరంగాపురం

## పద మథనం - 124 సమాధానాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | 2 యో | ని | 3 జ | ● | 4 శ్రా | 5 వ | ణ | మా | 6 సం |
| 7 రా | గి | ● | య | ● | 8 వృ | ధ | ● | ● | త |
| ణ | ● | 9 ము | ద్ర | ణ | ము | ● | 10 నా | 11 వి | ● |
| ● | 12 వ | ● | ఘు | ● | ● | 13 అం | గ | దు | 14 దు |
| 15 కు | చే | లు | డు | ● | 16 తో | ● | ● | 17 రు | వా |
| ద్య | ● | ● | ● | 18 వి | క | 19 లాం | గు | డు | ● |
| 20 ము | 21 ఖ | 22 వ | 23 ర్చ | స్సు | ● | త | ● | ● | 24 వి |
| ● | 25 న | ద | వ | ● | 26 కా | రు | 27 మ | బ్బు | లు |
| 28 మీ | సం | ● | 29 ల | ఊ | ● | ● | ట్లు | ● | కా |
| సం | ● | 30 కం | సు | డు | ● | 31 నా | దు | నే | దు |

పేరు: ______________________

ఊరు: ______________________

